# జయంతజయపాలము

బ్రహ్మశ్రీ
మద్దూరి శ్రీరామమూర్తికవిగారి
విరచితము.

కొండపల్లి వీరవెంకయ్య
శ్రీసత్యనారాయణ బుక్ డిపో,
రాజమండ్రి.

శ్రీసత్యానంద ప్రెస్‌నందు ముద్రింపఁబడినది.
రాజమహేంద్రవరము.
1933

 (వెల అ 12.

# గొప్ప జ్యోతిషగ్రంథములు.

గ్రంథకర్త:—ఆకెళ్ల వేంకటశాస్త్రిలుగారు.

| | | | |
|---|---|---|---|
| జ్యోతిషప్రథమబోధిని | రు. 0-8 | దశాభుక్తిఫలచంద్రిక అను వృద్ధపారాశరి | 1-0 |
| జాతకమార్తాండం 1వ భా. | 1-8 | జ్యోతిషవిద్యాప్రకాశిక సంజ్ఞాధ్యాయము | 1-0 |
| జాతకమార్తాండం 2వ భా. | 1-8 | 2వ గణితాధ్యాయము | 1-0 |
| జాతకమార్తాండం 3వ భా. | 2-0 | 3వ భావఫలాధ్యాయం | 2-0 |
| జ్యోతిషరహస్యం 1వ భా. | 1-8 | 4వ దశాఫలాధ్యాయం | 2-0 |
| డిటో 2వ భా. | 1-8 | బృహత్పారాశరసంహిత | 0-4 |
| గర్గసంహితం భావఫలాధ్యాయం | 0-4 | వాస్తుసంగ్రహము | 0-12 |
| ఆంధ్రజాతకతత్వం సూత్రములు 1వ భాగం | 1-8 | అదృష్టదీపిక | 0-10 |
| డిటో 2వ భాగం | 1-8 | జ్యోతిషఫలప్రదర్శిని | 0-10 |
| హస్తసాముద్రికం | 0-6 | శిల్పసంగ్రహము | 0-6 |
| ముహూర్తదర్పణము | 0-8 | జాతకచంద్రిక | 0-6 |

# వివిధగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| దండకరత్నములు (20 దండకములున్నది) | 0-6 | దస్తావేజుల మతలబి | 0-12 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు | 0-8 | ప్రశ్నోత్తరవేదాంతరత్నమాల | 0-6 |
| రామదాసుచరిత్ర (కీర్తనలు) | 0-8 | సంగీతవిద్యాబోధిని (స్వరములతో కృతుల కీర్తనలుగలది) | 1-[illegible] |
| వేడుకపెండ్లిపాటలు | 0-8 | మహిళామనోరంజని పాటలు | 0-[illegible] |
| విలువిద్య (బాణవిద్య నేర్చుకొను విధము) | 0-4 | గారడీవిద్య (యింద్రజాలము) | 0-[illegible] |
| హిందూస్థాని తెనుగుబోధిని | 0-6 | హిందీతెనుగుభాషాబోధిని | 0-[illegible] |
| స్త్రీలపాటలు (24పాటలబైండు) | 0-8 | కుశలవకుచ్ఛలచరిత్ర | 0-[illegible] |
| కుశలవుల యుద్ధము | 0-6 | గణితబోధిని | 0-[illegible] |
| | | కైవల్యామృతసారము | 0-[illegible] |
| | | ఆంధ్రనామసంగ్రహము | 0-[illegible] |

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్కుడిపో, రాజమండ్రి.

సంగీత

# జయంతజయపాలము

(5 అంకముల నాటకము.)



బ్రహ్మశ్రీ

## మద్దూరి శ్రీరామమూర్తి కవి

విరచితము.

రెండవకూర్పు 2000 ప్రతులు.

పబ్లిషరు:

కొండపల్లి వీరవెంకయ్య,

శ్రీసత్యనారాయణ బుక్కుడిపో,

రాజమండ్రి.

శ్రీసత్యానందప్రెస్సునందు

ముద్రింపఁబడినది.

రాజమండ్రి.

1933



[వెల రు. 1—6—

# పీఠిక.

భాషాభిమానులారా!

నాయోపినకొలఁది నీ జయంతజయపాలమను నాటకమును రచించి లోకమున కర్పించితి. ఇంచుమించుగ నియ్యది నా ప్రథమ ప్రయత్నమగుట నిందనేక దోషము లుండవచ్చు పాఠకమహాశయు లిందున్నదోషముల మన్నించి యొప్పులనె గైకొన ప్రార్థించుచున్నాఁడ.

లోకమున నెంద ఱెందరో కవిపుంగవు లీజయంతజయపాలమును మున్ను రచించియుండిరి. మఱల నయ్యది నేను వ్రాయఁబూనుట హాస్యాస్పదమైనను నామిత్రులకోరిక ననుసరించి వ్రాయఁగడంగి నందులకు మన్నింతురుగాక.

ఇట్లు,
విన్నవించు గ్రంథకర్త.
మద్దూరి శ్రీరామమూర్తికవి.

కాకినాడ,
13-2-31.



# ఈనాటకమునందు వచ్చు పాత్రలు.

## పురుషులు.

1. జయంతుఁడు—పాటలనగరాధీశ్వర కుమారుడు
2. జయపాలుఁడు—జయంతుని చెలికాఁడు
3. చిత్రకేతుఁడు—జయంతుని మామ
4. విజయసేనుఁడు—చిత్రకేతుని కుమారుఁడు
5. మంత్రి—చిత్రకేతుని మంత్రి
6. వెంకఁడు—మేదరనాయకుఁడు

## స్త్రీలు.

1. మోహిని—వారకాంత
2. భువనమోహిని—జయంతుని భార్య
3. చారుమతి—జయపాలుని భార్య
4. నర్మద } చారుమతి చెలికత్తెలు
5. సుశీల }
6. కాళికాదేవి

సందర్భానుసారముగా భటులు మరికొందరువత్తురు.



# జయంతజయపాలము.

## ప్రథమాంకము.

ప్రథమరంగము.

స్థలము — మోహినిశయనాగారము.

[ప్రవేశము — మోహిని.]

(మోహిని-సవినాసముగా నిలువుటద్దముచెంత నిలువబడి
ముంగురులు సవరించుకొనుచు)

సీ. పెనువేతనములను ♦ బిరుదంబులనుబొంద
దగినట్టి సులభ సా ♦ ధనము ధనము
యెట్టివారలనైన ♦ నిట్టిదాసులజేయ
దగినట్టి సౌఖ్య సా ♦ ధనము ధనము
యెట్టియాపదనైన ♦ నిట్టిదొలంగింప
దగినట్టి మంచి సా ♦ ధనము ధనము
యెట్టికట్టడినైన ♦ నిట్టిలోబడజేయు
జనవశీకరణ సా ♦ ధనము ధనము

గీ. పెక్కునుడులేల భువిని పెం ♦ పెక్కినట్టి
సర్వసౌఖ్యము లొనగూర్చు ♦ సాధనంబు
ధనము ధనములేకున్నచో ♦ దనయులైన
ముప్పొంగడుపంగ దరిజేర ♦ బోరుగాదె.

(సవిమర్శనముగా) ధనమా! నీప్రభావమెంతని కొనియాడగలము. ధనమూలమిదంజగత్తను పల్కులబల్కిన మహనీయులకు భవన్మహా మహిమంబు బాగుగా బోధకమైయుండును గాని యస్మదాదికించి

దుష్టులకు నీ ప్రభావాతిశయము లేశమైనను దెలియదుగదా? ఒకానొక వేళ దెలిసియున్నను ప్రయోజనకారి కాజాలదుగదా? నిక్కమున కిట్టి యమూల్యేతర పదార్థమును లోకైకవాంఛనీయమును, ధనమును సృజించుటలో నాచతురాననుడు దనకుగల నిర్మాణచాతుర్యమంతయు వినియోగించి యుండెనని దలంచుట సత్యేతరముగాదుగదా? ప్రాయ మరుదెంచినది మొదలు ప్రాణము "హరీ" యనునంతవరకు ధనాసక్తి, ధనమం దభిలాష, ధనార్జనోపాయాన్వేషణము, ఒక్కడైనను విడుచునా? అందునను, రూపజీవుల మగుటచే ననుదినంబును, అంతవరకేల, ననుక్షణంబును, ద్రవ్యార్జనకై ప్రాకులాడుటే మాకుల సాంప్రదాయముగదా! (సాలోచనముగా) నిక్కువమునకు ద్రవ్యార్జనకై నాయొనర్చు ప్రయత్నములు ఫలించిన యోజనాన్మంత మింటి నుండి కాలుగదుపకయే పొట్టగడుపుకొనవచ్చునుగదా! కాని ఒక్కొకసమయమునందు, యీకార్యమున నాకు జయము లభించునా లభింపదాయను సందియము మదియుంచుచున్నది. సుస్థిరస్నేహలతాపాశబద్ధులై చిరకాలబాల్యమునుండియు, యిరుమేనులనొక్కజీవమై ప్రవర్తించు జయంత జయపాలురకు, తీరని వైరంబు గల్గించుటకై తానొనర్చిన వివిధ ప్రయత్నములు నిష్ఫలమగుటచే వారిస్నేహము చెడకున్న వారిరువురును యుక్తవయస్కులై పుట్టింటనున్న దమభార్యలనైన స్మరింపరనియు, కోడలిని దోడ్కొనిరాక నాపెను పుట్టింట దిగవిడచుటచే లోకాపవాదమునకు వెరువవలయుననియు భూపాలుడు రెండు లక్షలదీనారముల నాకార్యము సాధించువారల కొసంగుదుమని ప్రకటించెను. ఎవ్వరైన నామొత్తమున కాశబడి యట్లొనరింతురనియే యాతనితలంపు. కానిమ్ము ప్రయత్నించి చూచెదను. భూపాలుడు సరియైనమార్గమున కార్యసాధనకై యొడంగియుండలేదనియే నాతలంపు. తండ్రి కుమారులకు, అన్నదమ్ములకు, ప్రాణస్నేహితులకు, నాలు

మగలకు దీరనివైరము గల్గింప సమర్థతగలవార లాడువారు. ఈవిష యపరిజ్ఞానములేక భూపాలుఁడు తానెన్నివిధముల యత్నించినను విఫ లుడగుటకు సందియమున్న దా? కాంతలు అందునను వేశ్యకాంతలు. అట్టివిషయములందు ప్రత్యేకానుభవముగలవారలై త్రుటిలోన, నొ క్కమాటతో కార్యసాధనమొనరింపగల చాతుర్యధురీణలు. కాన నాకీకార్యమున జయము లభింపగల దనునాశ జనించుచున్నది. రా కుమారుఁ డుద్యానవనమునకు బోయినట్లు దెలియవచ్చెనుగదా? అ చ్చటికేగి నానేర్పు జూపి నాయదృష్ట మెట్లుండెనో నిర్ణయించెదగాక.

(నిరమ్క్రమింప తెర వ్రాలును.)

ద్వితీయరంగము.

---

స్థలముద్యానవనము.

[ప్రవేశము—జయంతుఁడు.]

జయం—

గీ. చెడినయెడ బంధువులుదరి ♦ జేరుకంటె
స్నేహితులపొంత తలదాచి ♦ నిలువవచ్చు
ననెడివాక్యాళి బంధు జ ♦ నాళికంటె
హితులె ముఖ్యులటంచు జా ♦ టించుగాదె.

సన్మిత్రునిచే నపకారమునొందినవా డెవ్వడును గానబడడనియే నాన మ్మకము. బంధులన్ననో? నాల్గురూకలు చేనున్నతరి లేనిపోని బాం ధవ్యములు గలుపుకొన జూతురుగాని లేవడినున్న దరిచేరరారుగదా? మిత్రుడు- సుహృద్భావముగల మిత్రుఁడు. తనహితునకాపద తటస్థిం చిన నయ్యది తనదిగా భావించి తోడ్పడయత్నించును. గాని దూరగు డగునా? ద్రవ్యమున కాశించి పెట్టుపోతల కాశించి యిచ్చకము లాడుచు దరిచేరుమిత్రులందరును పరమపవిత్రమైన మిత్రశబ్దమున

కవయశ్రేమొనగూర్చెడుమూర్ఖులని తలంపవలయును. నిక్కముగా సుహృద్భావముగల మాజయపాలునివంటి మిత్రుఁడు లభించుట పూర్వజన్మ సంచితార్థ సుకృత విశేషఫలంబనుట కిసుమంతయు సందియ ముండదుగదా? నే డింకను యాతఁ డరుదెంచినట్లు తోపదు. కాదు కాదు. పొరబడుచుంటిని. వచ్చి యుండెందో నారాకకై నిరీక్షించు చుండును. (పరిక్రమించుచు ముందునకుజూచి) అదే వనపాలునితో నేమో మాట్లాడుచున్నాడు. మిత్రమా! మిత్రమా!!

[ప్రవేశము-జయపాలుఁడు.]

జయ__రాకతడయుటచే నింక రావని భావించితిని.

జయం__సకాలమునకు రావలయుననియే బయలుదేరితిని. కాని, నడుమ నొకచిన్నయాటంకము గల్గినది. నే బయలుదేరి వచ్చుచుండ జనకుడు నను బిలువనంపెను. పోవకున్న కోపగించునేమో యని వెడలితిని. ఆతనితో సంభాషణ ప్రారంభమైన నయ్యది యంతమొందుటకు సుమారొక్క దినమైనను గావలయుననుట నీవెఱిగినదేగదా?

జయ__ఏవిషయమై సంభాషించియుండిరి?

జయం__ఏమున్నది? ఎన్నిదినములు చెప్పినను ఒక్కటియే. రాజ్యభారము వహించుమని. అంతకంటె నధికమేమున్నది. ఇంకను నాపై రాజ్యభారము నిలుపవలదని నేను వేడుకొనుట. దీని తోడనే పుణ్యకాల మతిక్రమించినది.

జయ__బాగుగానున్నది. ముదుసలియగు జనకుడు సంప్రాప్తయౌవ్వనుఁడై - సర్వవిద్యాప్రపూర్ణుఁడై - చతురుపాయధురీణుఁడై - వేయేల సర్వవిధముల వసుంధరాపరిపాలనమున కర్హుడై యున్న కుమారుని రాజ్యభారము గైకొమ్మనుట లోకాచారమే. కాని కుమారుఁడు లోకాచారవిరుద్ధముగ నీవలె నుత్తరమిచ్చినవా

రెవ్వరును లేరు. తొల్లి శ్రీరాముడేమనెనో తెలియదా? నీవ
ట్లు జనకునితో బలుకుటకుగల హేతువెద్దియో గోచరింపదు.

జయం — నాయభిమత మెఱింగింపుమందువా? ధరాపరిపాలనాభారము తలపైబడిన నిప్పటిసుఖములో నావగింజంతైన నవ్వాడుండదనియే నాయభిప్రాయము.

జయ — ఏల?

జయం — ఏలా?

సీ. రాజ్యరక్షణతత్ప ♦ రతగల్గుటేగాని
విముఖతజూపింప ♦ వీలుకలదె
సభలోనగూర్చుండి ♦ చర్చించుటేగాని
హాయిగానిటుదిరు ♦ గాడనగునె
జనులపాలించు వి ♦ చారభారమెగాని
నితరంబుమదిలో వ ♦ శింపనగునె
నియమితకృత్యముల్ ♦ నెఱవేర్చుటేగాని
యిచ్చవచ్చినటు చ ♦ రింపనగునె
గీ. ప్రకృతిచిత్రంబులను గన ♦ వలనువడునె
వేయిపల్కులకవకాశ ♦ మీయనేల
కనులకల్మికి సాఫల్య ♦ గరిమగనెడి
భాగ్యలాభంబుగలుగ దె ♦ వ్వటికినైన.

ఈ హేతువుచేతనే మజ్జనకునివల్కు లన్యథా భావింపవలసివచ్చినది.

జయ — మిత్రమా! అట్లనుటసరికాదు. జరాభరంబున ధరాపరిపాలనాభారము వహింపజాలకున్న జనకునిసౌఖ్య మారయక, స్వార్థపరాయణునివలె నీసౌఖ్యమే జూచుకొనుచుంటివి.

జయం — ఒక్కొకసమయమందు జనకునియభిమత మీడేర్పవలయు ననియు, నాతనికి సంపూర్ణవిశ్రాంతి యొసంగవలయు ననియు

దలంచుచుండు కాని మన యీవిహారములకు మనస్వేచ్ఛకు
భంగము కలుగునని సంశయమందుచున్నాను.

జయ—రాష్ట్రపరిపాలన మొనరించుచున్న స్వేచ్ఛావిహారమునకు భంగము గలుగునా ?

జయం—కలుగదా ? ఇంతస్వేచ్ఛగ మనము కలసికొనగలమా ?

జయ—ఏల ? (పరిహాసముగా) జయంతమహారాజావారు యింక మిమ్ము దరిజేరనీయరుగాబోలు.

జయం—అదిమాత్రముగల్ల. జయపాలుడు ప్రధానామాత్యుండైన పిమ్మట నాతనిసాంగత్యలాభమునకే నేను భూపాలపదమాసించెదనుగాని యటుగానియెడ నాతనితోగల చెలిమి విధ్వస్త మొనరించు రాష్ట్రపాలనమును కెన్నడు సమ్మతింపను. అదే వనపాలుడేలనో యిట్లరుదెంచుచున్నాడు.

[ప్రవేశము—వనపాలుడు]

వనపాలు—(నమస్కరించి) దేవా ! ద్వారముకడ నొకవేశ్యాంగన దర్శన మపేక్షించి నిలచియున్నది.

జయం—నన్నుదర్శించుటకా ? లేక జయపాలుని దర్శించుటకా ? పొమ్ము. ఎందులకో కనుగొనిరమ్ము ?

(వనపాలుడు నిష్క్రమించును.)

జయ—ఇపు డీవేశ్య యిట్లరుదెంచుటకు గల హేతువెద్దియోగదా !

జయం—వనపాలుడరుదెంచినగదా దెలియును.

[పునః ప్రవేశము—వనపాలుడు]

వన—(నమస్కరించుచు) తమ్మిరువురనుదర్శింపనరుదెంచెట.

జయ—సమయముకాదని దెల్పుము.

జయం—ఏల ?

జయ___వేశ్య లేకార్యమొనర్చినను ధనసంపాదనకొఱకు. మనల దర్శించుటవలన తనకేదో లాభము గలుగగలదనియే దానియభిమతము. కావున యిపుడు సమయమీయకుండుటయే యుత్తమము. మరియొకవిషయ మాలోచింపుము. సదభిప్రాయముతో మనల నామెజూచుటకు సంకల్పించుకొని యున్నయెడల నీపూదోటలో దర్శింపనరుదెంచుటకంటె, ఈయేకాంతసమయమున నరుదెంచుటకంటె, హెచ్చుసమయములేదా? గావున నీమె యేదో దురభిప్రాయముతో నరుదెంచియుండుననుట స్పష్టపడుచున్నది. ఇంతియెగాక, యీవేశ్యాంగనను లోనికి రానిచ్చితిమేని, లోకములోన, భూపాలుడును మంత్రికుమారుడును యువవనమున విశ్రమించుట యనుమిషచే నచటకేగి వారకాంతల నచటికి బిలిపించి, వారితో గోష్ఠ్యవర్తనమున దగిలియుండిరను ప్రతీతి వ్యాపింపగలదు. ఎట్టియపఖ్యాతియు రాకుండగనే యుండవలయునుగాని వచ్చిన యంతనింతటబోవునా?

జయం___ఏమి? నీయపూర్వజ్యోతిషము! ఇంతమాత్రమునకే పెక్కులగు యనర్థములు సంభవించునా? అంతమాత్రముననే లోకులనుమానింతురా! అట్టిలోకము, యీవరకే ఆవేశ్యను యుపవనద్వారమునొద్ద జూచినంతనే, యనుమానింపకుందురా? నీవెట్టియపవాదువచ్చునని భావించియుంటివో యది, యీవరకేవచ్చియుండలేదా? నాయభిప్రాయమేమన; వచ్చిన యీమెకు దర్శనమొసంగి, యింకనీవెన్నడిచటికి రావలదని హెచ్చరించి పంపివేయుదము. ఇంతమాత్రమున ప్రమాదములేదు.

జయ___వలదు, వలదు. ఇకార్యమునకే నేనామన మంగీకరించుటలేదు.

జయం—మిత్రమా! నీ విట్లాటంకపరచుటలోఁగల నీయభిప్రాయ మవగతమగుటలేదు.

జయ—నాయభిప్రాయమా? ఏమున్నది? యువరాజచంద్రుఁడు యే కతమున నొకయుపవనమునందు నొక్కఁజనునకు, అందునొక కాఁతకు, కాంతయనిన సామాన్యకాంతకుఁగూడగాదే వార కాంతకు దర్శనమొసంగుట విరుద్ధాచారమనియే. ఇంకను స్పష్టీకరింపుమందువా? నీకామెకు సందర్శనమొసంగవలయునని యున్నచో దర్బారులోని కుదయమున రమ్మని జెప్పివంపుము.

జయం—నీపల్కుఁ తీరుజూడ నామెనుగాంచి యుబ్బిపోవువాడనగుదు నేమో యని నీవు సంశయించుచున్నట్లు తోఁచుచున్నది. అట్లి న్నటికిని గాఁజాలదు. ఒక్కఁ క్షణములోననే యామెను బంపివై చెదను. వనపాలా! ఆమెను గొనిరమ్ము.

జయ—మిత్రమా! అటులైన నే నరుగుటకానతియిమ్ము. ఆమెవెడలి నపిమ్మట మరలవచ్చెదను.

జయం—మనలనిరువురను సందర్శింపగదా యామె యరుదెంచినది? ఇపుడునీవేగెదవా? వలదు. వలదు. ఇట నన్నొంటిగానుంచి నీవేగదలంచితివా? వలదు. వలదు.

[ప్రవేశము—మోహిని, వనపాలుఁడు]

వన—వారే యువరాజచంద్రులు. మోహినీ! పోయి వారిని దర్శింపుము.

మో—(స్వగ) ఆడఁబోవు మహానాటకమునకు ప్రస్తావనయైనది. ఇంక నాచాతుర్యముఁ జూపుచు నీప్రథమాంక మాడవలయును. అనంతరకథావిధానమున కాజగన్నాటకసూత్రధారుడేకలడు. (యువరాజును సమీపించి) ప్రభువరా! నమస్కారములు. సచివాగ్రణీ! వందనములు.

జయ—నీపేరేమి? ఇట్లేల నీయుపవనంబున కరుదెంచియుంటివి?

మో—నన్ను మోహినియని బిలుచుచుందురు. తమ్ముదర్శించి నాజన్మము చరితార్థము గావించుకొనుటకు.

జయ—నీవరుదెంచిన కార్యము ఫలించినదిగదా! ఇంకక్షణమైన నిట నిలువక వెడలిపొమ్ము.

మో—(స్వగ) పలుకులకేని యెడమీయక నీజయపాలుఁ డడ్డుదగులుచున్నాడు. పానకములోని పుడకవలె నీతఁ డడ్డురాకున్న నీవరకే నే నరుదెంచిన కార్యము ఫలించియుండును. కానిమ్ము. విడువక యత్నించిచూచెదను. (ప్రకా) సచివాగ్రణీ! నాయరుదెంచినకార్యములలో నొక్కటిమాత్రమే ఫలించినది. కాని-

జయ—ఆ రెండవకార్యమేమి?—

మో—దేవరకు నా గానాభినయముల జూపి వారిచే సన్ననలందవలయునని.

జయ—శాస్త్రాభినయ ప్రదర్శనమున కింతకంటె తగినయదను నీకు లభింపలేదా?

మో—సచివాగ్రణీ! తమ రేయిటుబల్కిన నే నేమనగలదానను. సాయంసమయమున, ప్రకృతిదర్శనీయమై యత్యంతసంతతామోదమొనగూర్చు సాయంసమయమున, చల్లనిపిల్లవాయువులు సౌరభయుక్తములై వీచుచు దేహంబుల కంతుదరిలేనియానందమొసంగుసమయమున, యువవనమున, యరవిరిసినపూలనుండి ఘుమ్మని లేచు పరిమళయుక్తప్రసూనసంయుతమగు నీయుపవనమున, కడుంగడు సంతసంబున కడుపునిండుటచే నోరూరకొనదను సామ్యామును రూఢిసేయుచుందంబున నవ్యక్తమధుర స్వనంబున గానమొనర్చుపికావళులతో నొప్పారు యీపుష్పవనంబున, అమితోత్సాహపరవశులై యున్న మీచెంత నాగానా

భినయములజూపుటకు యింతకంటె మంచియవకాశము లభించునా? కల్ల. కాదు కాదు. ఇదియే తగినసమయమని తలంచితిని. తమరిపుడు సమయమీయవలనుపడదనిన వెనుకకుమరలుదును. మరియొకప్పుడు దేవరవారి సందర్శనార్థ మరుదెంచెదను.

జయ___శీఘ్రముగాపొమ్ము. ఇంకెపుడును యిటురాకుండుము.

జయం___మిత్రమా! (అప) ఈచెడిపె నిపుడుపొమ్మనిన మరియొక పరివచ్చును. అట్లురానిచ్చుటకంటె నిప్పుడే యొకపాటపాడించి యేదో మనకు దోచినదొసంగి పంపివేయుదము.

మో___(స్వగ) జయంతజయపాలురకుగల స్నేహము ధ్వస్త మొనరించినందులకు భూపాలుడొసంగ ప్రకటించినధనముననేగాక, యీ జయంతకుమారుని నావలపువలలో దగుల్కొనజేసి హాయిగా సుఖింపగలనని తలపోసితిగాని నాతలంపులకెల్ల నీమంత్రికుమారు డడ్డువచ్చుచున్నాడు.

జయ___(అప) వలదు. వలదు. ఈమెపల్కులు యథార్థములని భావింపకుము. నిలువెల్ల కల్లయగు నీవెలయాలు నిక్కువముగా దనవిద్యాతిశయము జూపుటకే యరుదెంచెనని తలంచితివా?

జయం___(అప) మిత్రమా! నీకు వీరిపై నింతద్వేష ముదయించుటకు గలకారణము?

జయ___(అప) వీరిగుణప్రవర్తనాదికములే.

ఉ. రూకగొనుసంగుమాత్రమున ♦ రోగుల హీనుల పెద్దరోగులం
గైకొని యాదరించెదను; ♦ సిగ్గువిడంబుల నొక్కరూక కో
పోకకొ విక్రయించి తమ ♦ పొట్టకుబెట్టక నిద్రపోరు; నే
వాకొనజాల వీరిగుణ ♦ వర్తన లిట్టివటంచు మిత్రమా?

ఈవేశ్యాకాంతలయందీదుర్గుణముకలదు. ఇదిలేదని వక్కాణించుటేల?

పుడమిపైగల దుర్గుణసముదాయమంతయు వీరియందు మూర్తీభవించి యుండును.

జయం.—కానిమ్ము. నీయభిప్రాయానుసారముగ నీమెనిప్పుడే బంపివేయుదును. (ప్రకాశముగా) మోహినీ ! నీవిప్పుడరుదెంచితివి. వృథా నినువెనుకకు బొమ్మనుటకు మనస్కరింపకుండనున్నయది. నీగానాభినయముల దిలకించుటకు దగినయవకాశము లేదు, గాన నిప్పటికీముత్యములహారమును నాయొసంగు కానుకగా గ్రహించి సంతుష్టినొందుము. (అనియొసంగబోవును)

మో.—(తీసికొనక) పోనిండు. ఇవుడుగాకున్న మరియొకప్పుడు దేవర సందర్శనార్థ మరుదెంతును. ఇవుడు నాకీబహుమానముగూడ వలదు. అసమర్థులగు నటకుల కభిమానముపెంపున నొసంగు సువర్ణపతకములభాతి నియ్యదియు నిరర్థకమగునుగదా ? తమకు దీరికగలయపుడు నావిద్యాప్రవీణతజూపి యపుడే తమ మన్ననలందెదను.

జయం.—మరలరానేల, ఒక్కపావుగడియలో నీవిద్యజూపుము ?

జయ.—(స్వగ) మూషికము మార్జాలముదాపునకే బోవుచున్నది. ఎట్టియనర్థముగలుగునో ? అరే ! నిష్కారణముగా వామనేత్రమదరుచున్నది. కుడిభుజ మదరుచున్నది. నేత్రమదురుటవలన నష్టము. భుజమదరుట శుభసూచకము. చిత్రముగానున్నదే.

మో.—(నమస్కరించి) అనుగ్రహింపబడితిని. (శ్రావ్యముగాబాడుచు నభినయించును.)

జయం.—తన్వీ ! నీగానామృతము న న్ననవరతసంతోష వారాసిలో నోలలాడించెను. (మరియొక ముత్యములహారమును గూడ గలిపి బహుమానమొసంగ మోహిని స్వీకరించును.)

జయ—మోహినీ! నీవరుదెంచినకార్యము ఫలించె నిక తడయక గృహాభిముఖవగుము.

మో—అమాత్యకుమారా! నే నరుదెంచినకార్యము దీరినపిమ్మట గూడ నిట కాపురముందునా? యువరాజచంద్రమా! అనుజ్ఞ దయచేయుఁడు.

జయం—మంచిది. సంతోషితవై యరుగుము.

(మోహిని యించుక దూరమేగి జయపాలునివైపు జూచుచు రమ్మని సైగచేయును.)

జయ—ఇప్పటికి పిశాచము వదలినది.

జయం—మిత్రమా! వారిని నీవింతగా నిరసనభావమున జూచుట తగదుసుమా! ఏలనన వీరివలననేగదా గానాభినయము నంతరింపకుండ నీభావలయమున నిలిచినవి. అదే యామె వెనుదిరిగి జూచుచు నినుబిలచుచున్నది.

జయ—పిలువనిమ్ము. మొత్తుకొననిమ్ము.

(నేపథ్యమున) మంత్రికుమారా!

జయం—మరల నిన్నే బిలచుచున్నది.

జయ—పిలువనిమ్ము. ఇంకను పిలువనిమ్ము. పిలచినమాత్రమున పోవుటకిందెవ్వరు సిద్ధముగా నున్నారు.

జయం—ఎందులకు బిలచుచుండెనో కనుగొనగూడదా?

జయ—ఆ చెడిపెకు నాతో నేమిపని యుండును. ఒకానొకవేళ నాపెకు నాతో బనియున్నను నా కామెతో నిమిత్తములేకుండుటచే పోన గత్యము లేదు.

జయం—అగత్యమున్నదని పల్కుట లేదు. నీవేగి యామె నింక నెన్నడు యిచటికి రాకుండునట్లొనర్చి సాగనంపుము.

జయ—అందులకు వనపాలుఁడుండెగదా?

(తెరలో) మంత్రికుమారా!

జయం—అదే మరల పిలుచుచున్నది పోయిరమ్ము.

జయ—మిత్రమా! వలదు వలదు. నన్నా కులటయొద్దకు బొమ్మని చెప్పకుము. ఇంకొకసారి చెప్పినచో నీయానతి తిరస్కరింప జాలక పోయెదననియే దలంపుము. అందుమూలమున నెట్టియ నర్థము లుత్పన్నమగునో యెవ్వడెఱుగును. నిర్బంధింపకుము.

జయం—ఒక్కపరి పోయివచ్చుటకు సంకోచించుచుంటివా? ముమ్మా రుపిలచినను పోకుండుట ధర్మమా! పోయిరమ్ము. (తనలో) ఈతడు ఆమె బిలచుచున్నను యేలపోకుండెను. నిక్కముగా నామెపై ద్వేషమా! లేక ప్రేమమా!

జయ—మరలమరల జెప్పుచుంటివి. ఎట్లుగానున్న నట్లగును. కానిమ్ము పోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

జయం—ఆపడుపుపడంతి యీతని నెందులకు బిలిచియుండును. ఈతని కామెతో నీవరకే పరిచయముండెనా? ఉండియుండవచ్చును. ఏమియులేకున్న ముమ్మారామె యీతనిబిలుచుట కేమిహేతువు...(ఆలోచించి) కాదుకాదు. ఈతడట్టి వాడుకాడు. ఆమె తా నరుదెంచిన కార్యమున కీతడడ్డుదగిలి యుండెనని దలపోసి యాతని లోబరచుకొన మాటలాడ బిలిచియుండును. ...ఇదియేనిక్కువము. ఇంకనాతనివ జనుదెంచిన కార్యమే మున్నది. నాప్రాపక మాశించియే యుండుటకంటె నీవెల యాలి కియ్యెడగలకార్య మేముండును. ఈజయపాలుడు దనకు వశ్యుడైనచో దనకు నాప్రాపకము లభించుట నిముస ములోని పనియని దలంచియుండును. ఏటికీ వెఱ్ఱియాలోచనలు? ఆతనివలన సర్వమును దెలియగలవు.

[ప్రవేశము—జయపాలుడు.]

జయ—ఎంతమాయలాడి. దరికిబిల్చి దాసరీ నీకన్నులొట్టయనునట్లు చేసినదిగదా...ఒక్కనిముషమైన నిలువకుండ పరుగిడినది. లేకున్నచో చక్కగా బుద్ధిజెప్పియుందును.

జయం—(సమీపించి) మిత్రమా! వచ్చితివా! ఆమెను తోట దాటించితివా?

జయ—ఒక్కనిముషమైన నిలువక పరుగిడెను. లేకున్న ప్రాయశఃనే నామె నీలోకమునుండియే దాటించి యుందును.

జయం—నిన్నెందులకు బిలిచినది?

జయ—ఏమియును లేదు.

జయం—నీతో మాటలాడకయే వెడలిపోయెనా?

జయ—అటులనే తలంపవలయును.

జయం—అనగా నీతో నామె యేమనినది?

జయ—అనుటకేమున్నది. దరికిబిలిచి దాసరీ నీకన్నులొట్టయనినది. వడ్లగింజలో బియ్యపుగింజయని పల్కి పరుగిడెను.

జయం—అనగా?

జయ—ఆమె యక్కరములను తూ, చా, తప్పకజెప్పితిని.

జయం—నాయొద్దగూడ కొంతమరుగు పరచుచుంటివి.

గీ. పసితనమునుండి యొక్కటే ♦ ప్రాణి, రెండు
మేనులందున గలయట్లు ♦ మెలగుచుంటి
మట్టిచో నీవునాపెవా ♦ క్యాళినిట్లు
దాపరిక మాచరింపగా ♦ దగునె చెపుమ.

జయ—నాపల్కులయందిసుమంతయు నసత్యములేదు. ఆమెనోటి నుండి వెలువడిన ప్రతియక్కరమును నీకుదెలిపితిని. అంతనే నాగ్రహముజెంది గద్దించుచుండగా కాలికిబుద్ధిజెప్పి పరుగిడెను.

జయం.—ఎంతకట్టుకథ బన్నితివి!

జయ.—(స్వగ.) ఇదేమి యీతడిట్లనుచున్నాడు.

గీ. మున్ను నేనేది బలుకస ♦ మోదముగను
నదియె నిక్కమానని మది ♦ నరయువాడు
నిక్కవము దెల్పుచుండగా ♦ నేడు విశ్వ
సింపడేలకో హేతువ్వా ♦ హింపబడదు.

(ప్రకా) పోనిమ్ము. అలతాంగి నాతో నేమనిబల్కినదని జెప్పిన నీవు విశ్వసింతువు?

జయం.— ఇదేటి ప్రశ్న? నేనేది విశ్వసింతునందునో యదియే నీవు
చెప్పదలంచితివి గాని యీమెపలుకుల జెప్పవుగదా?

జయ.—నిక్కవము దెలిపిన నమ్మకుంటివిగదా?

జయం.—ఇంకను పరిహాసమేనా! ఇంతవాగ్వాదమేంటికు. నేనాపె
పలుకుల నీకెఱిగింప సనుము. నిన్ను బాధింతునా? ఊరక లేని
పోని యసత్యములాడి కోపము దెప్పింపకుము.

జయ.—సత్యమే వచించుచున్నాను. ఈవిషయమటుంచుము. ఎన్న
డైన నీతో నసత్యమాడి యుంటినా?

జయం.—ఇంకను నదియే ప్రసంగమా?

జయ.—(స్వగ) ఈతనికి కోపమువచ్చుచున్నది. మరియొకమార్గము
ద్రొక్కి జూచెదను. మిత్రమా! అలతాంగి నిను నీరాత్రికి దన
గృహమునకు దోడ్కొని రావేశినది.

జయం.—ఛీ! వదరకూరకొనుము. పరులెవ్వరైన విన్న పరిహసింతురు.
ఇంతకుత్సితుడవైతివేమి! ప్రాణమిత్రుడని పేరుపెట్టుకుంటివే.
ఇదియేనా మిత్రత?

జయ.—నిష్కారణము నాపై యలుగకుము. నాపలుకుల యదార్థ
మామెవలనే యెఱుంగుము.

జయ.—ఇంతమాత్రమునకు సాక్ష్యములు గావలయునా ? ఇంతటివా డవైతివా ?

జయ—ఆ కులట నిచ్చటికీడ్చుకొనివచ్చెద. నా సత్యమును ఋజువుచేసికొనియెదను.

జయం.—ఊరకొనుము ! నీవంతటి ధీరశాలివి గావచ్చును. నీగుణాగుణంబులు నేటికి వారవధూటిమూలమున తెల్లమయ్యెను. పట్టపవలువన్నె వేదికలపై సంతత ధారావృష్టిగా వేశ్యలబడదిట్టుచు రేయియందు ముసుంగువెట్టికొని వణ్యాకాంతల గృహంబుల కేగి వారిపాదములపై బడి పెక్కువిధముల దమ్మనుగ్రహింప ప్రార్థించుచుండు మహానుభావు లెందరో యుందురని వింటిని. కాని, నేటివరకు నట్టివారినిజూచి యుండలేదు. అట్టివారు బహిష్కారమునకు దగుదురుగాని సన్మానమున కర్హులగుదురా ? కాన నీవు యింకముందు నాకు నీమోము జూపకుము.

జయ—(అనుబంధము.)

జయం.—ఇంకనైనను సరియైనమార్గమునకు రాకుంటివేమి ? నిముషమైన జాగొనరింపక వెడలిపొమ్ము—

జయ—(అనుబంధము.)

జయం—బాగుగానున్నది. ఇట్టి నీచాత్ముల నెంతత్వరలో నెడబాసిన నంతమంచిది. ఇచట గూర్చుండి నీయిచ్చవచ్చినట్లు విలపింపుము.

(నిష్క్రమించును.)

జయ—(అనుబంధము.)

ఇంకేమి సేయువాడను. ఎంతకును నమ్మడాయెను. ఆహా !

సీ. పిలచినమాత్రాన ♦ వేవేగ పొమ్మని
బలవంతె మాతకు ♦ పరువ నేల
బలవంత పరచిన ♦పాడిగాదని పల్కి
మందలింపక ప్రాలు ♦ మాలినాడ
వెడలి యకార్యంబు ♦ వేశ్య యొనర్చిన
విరచి కట్టక నేల ♦ విడచినాడ
విడచినందులకెదో ♦ విధముగా కల్లల
బలుకక నిజమేల ♦ బలికినాడ

గీ. ఇపుడు దలపోసి చింతిల ♦ నేల మున్నె
చెడుగుదలపోసియును యేల ♦ వెడగు నగుచు
దరలిపోవక యిచట ను ♦ స్థిరతనిలచి
యుంటినోదలపోయ లే ♦ కుంటిగాదె.

అతి సునిశితమైయుండు నామనంబు నేడిట్లు వికలత్వమొందుట విధి ప్రాబల్యమువలననే గాని వేరొండుగాదుగదా ? కానిమ్ము. అపరాత్ప రుఁడిట్లు భావిచరిత్రమును నడపునోగదా ? (నిష్క్రమించును)

[పునః ప్రవేశము—మోహిని.]

మో—భళీ ! నానేర్పున వీరలకుఁ దీరని వైరముగల్గించితిని.

గీ. అరయ జయంతజయపాల ♦ మందు నేను
జూపవలసిన చాతుర్యముఁ ♦ జూపి కలహ
బీజమును నాటియుంటి నీ ♦ విధముగాను
తక్కగల యంకముల గల్గు ♦ తత్ఫలంబు.
భూపాలున కీవృత్తాంతము దెల్పి నా బహుమానమును గొని చనెదను.

(నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.

# జయంతజయపాలము.

## ద్వితీయాంకము.

### ప్రథమరంగము.

(భువనమోహిని శయనాగారము.)

భువ—

ఉ. ఏటికి దాపరించె నిత ♦ డెవ్వడు బిల్వగ వచ్చె నిన్నినా
ళ్లేటి కుపేక్ష సేసె; మును ♦ పెన్నడు లేనటు నన్ను జూడ యా
రాటముగల్గెనో కొ—; యును ♦ రాగము పుట్టెనో; జాలితోడ నా
పాటుదలంచి గావగ న్నృ ♦ పాపరతన్ జనుదెంచినాడొకో.

ఇన్నివత్సరములవర కాతనినే స్మరించుచు నాతనికొరకే వెంగొని నా యెలజవ్వనమంతయు నేలపాలు గావించుకొందుననియే తలంచి యుండెగాబోలును. పాపము. నన్ను మరచి తానున్నపుడు నే నాతని మరచి నామదికెక్కిన యామేదరనాయకునితో సుఖించుచుంటిని. ఇన్నిదినములు నావైపైన జూడనందుల కాతని జూడకుండవలయు ననియే భావించియుంటిని గాని నేటితీరు జూడగా నయ్యది యసాధ్య మైనట్లు దోచుచున్నది. ఎంతయో వింతగ నీశయనాగారమంతయు నలంకరించిరి. ఈదినమున నన్నా జయంతునితో గలుపుటకు నిర్దేశించియుండుటవలననే యీవింతశృంగారము తాండవించుటకు గల కారణము. అటులైనచో నామేదరనాయకునితో గూడుట కవకాశ ములభింపదేమో! అయ్యో అతనిగూడ కెట్లుందును. ఈతనికొరకై నేవలచి వలపించుకొనువానిని త్యజింపనగునె.

గీ. గళమునందున సూత్రంబు ♦ కట్టె గాని
నన్నుజూడక యిచట నే ♦ నున్నయట్టి
దలపకుండిన వానికై ♦ వలచియున్న
వాని విడువంగ దలపోయ ♦ భావ్యమగునె.

అట్లొనర్పజాలను. ఎటులైన నామేదరనాయకుని నేడు గలసికొని సుఖింతును. గాని, యీ జయంతునితో నొక్క ఘడియయైన గడుపను. నాయభీష్ట మీడేర్చుకొనుట కనువైనమార్గ మన్వేషించెదను.

(నిష్క్రమించును.)

## ద్వి తీ య ర ం గ ము.

భువనమోహిని శయనాగారము.

[ప్రవేశము—జయంతుఁడు.]

జయం—పరిణయమైనదిమొద లింతవఱకును రాకున్నందులకు మామగారికి క్షమాపణ జెప్పుకొనుటయైనది. ఇందులకై నావలపుల పంటయగు భువనమోహినికి దగిన సమాధాన మెట్లొసంగ గలనోగదా? నైజముగా స్త్రీ లనుమానపీడితులు. ఎంతగా వచించినను నిట్టిపరిస్థితులందు నమ్మకముంచరు. ఇంతరాత్రియైనను యామెరాకున్నదే! నిక్కముగా నాపై కోపగించి యిన్నిదినములు నే నుపేక్షజేసినందుల కనువైన దండన మొనర్ప సంకల్పించుకొని యీరీతిని జాలమొనర్చుచుండెనా? కాదు. పొరబడుచుంటిని. ముగ్ధయగుటచే సిగ్గుననింతవర కూరకొని యుండునేగాని యన్యముగాదు. అదే! సఖీపరివృతయై జనుదెంచుచున్నది నావలపులపంట.

[ప్రవేశము — భువనమోహిని — చతుర.]

చతుర — అమ్మా! ఇంకను సిగ్గుపడెదవెందులకు? అదే విభుడు నీ యాగమన మపేక్షించుచుండెను. ఇంకనాకు సెలవు.

(నిష్క్రమించును.)

(భువనమోహిని దూరముననే నిలచియుండును.)

జయం — (స్వగ) పిలువకుండ సమీపించిన నేమనిభావింతునో యని యటనిలచెను. (ప్రకా) ప్రియా! దూరముననే నిలువంబడి తివేమి?

భువ — (స్వగ) కథాకదనమున కుపక్రమించెను. ఈతనిబారినుండి తప్పించుకొనుట సులభసాధ్యమగునో కాదో గదా?

జయం —

ఉ. ఏటికుపేక్ష జేసెదు ని ♦ జేశుని చెంగట సిగ్గునొందగా
నేటికి జేరరమ్మ చల ♦ మేలను కౌఁగిలియిమ్ము, చూడుమా
వాటమెఱింగి మన్మధుడు ♦ వాడిశరంబుల దేహమందునన్
నాటి పరాభవించె లల ♦ నా యికనైన నను నన్ను బ్రోవుమా!

ఇన్నిదినంబులవరకు రాకుంటినని కోపగింపకుము. విధికృత మట్లుండుటచే రాజాలనైతిని. ఇకముందు నేజెప్పబోవుదులకు నీవే ప్రత్యక్షముగా జూడగలవు. ఒక్కనిముషమైన నిన్నెడబాయను. (సమీపించి చేయి బట్టుకొనబోవును.)

భువ — (తప్పించుకొని) ఇన్నిదినములవఱకు మి మ్మాదరించి లాలించి కేళీవిలాసముల దేలించినముద్దుగుమ్మ లెందరోయుండ నే నెందులకు?

జయం — ఏమంటివి? మున్ను నను లాలించి దేలించినవారలా! వారెల్లరు నీ కాలిగోటికైన సరిపోల్పదగరు.

భువ — అట్లైన నిన్నిదినములు వారితోనుండనేల?

జయం.—నిక్కము వచింపుమందువా? నీ త్రిజగన్మోహన రూపము నీవరకు గనియుండకపోవుటచే.

భువ.—అయ్యది నాతప్పిదమేనా? కట్టుకొనిన భార్యగనాయుంటి, కని కరమునంచి యాదరించవలసియుండగా నిన్ను జూడకపోవుటచే నందగత్తెవు కావని యితరులతో నుంటినని జెప్పుచుండిరా?

జయం.—గత మింక మరచిపొమ్ము.

భువ.—మరచియేయున్నాను. మరువక నే నేమిజేసితిని. రా రమ్ము. ఏలుకొమ్మని వార్తలబంపితిని. అత్తమామలచే జెప్పించి తిని. వేయేల చేయదగిన ప్రయత్నము లన్నియును జేసి జేసి వేసారితిని. అవన్నియును మరచి నావిధి యిట్లున్నది గదా యని వల వల కన్నీరు రాల్చుచు యిట్టి పరాభవమొందియు నీ తుచ్ఛజీవ మింకను దేహమును వదలకున్న దేమని తలంచు చు క్షణమొక యుగముగా గడపితిని. అన్నియును మరచి తిని. మరువకయే యున్నచో నయ్యగారు గ్రామసంచార మేగిన నమ్మగారు దేశసంచార మగుగునను సామెత రూఢి చేసియే యుండవలయునుగదా?

జయం.—ఇంక ముందుసంగతి దలంపుము.

భువ.—ముందేమున్నది? తమముందు నేను. నాముందు తమరు. ఇం తకంటె యేమున్నది. క్షణక్షణనూతనవిలాసములతో, దిన దినైకనూతనభోగములతో, నత్యంతిసంతోషముగా, బ్రహ్మా నందపదముగా సుఖింపవలసినదినము లన్నియు గతించినవి. ఆజవ్వన మంతరించినది. ఇంకముందు లోకమున మనచరిత్రమే యాదర్శకముగా గొనుటయున్నది.

జయం.—యభిప్రాయ మదిగాదు. ఇంకముందు రోహిణీసుధాకరుల పోల్కి—రతీమన్మథుల చందమున—

భువ—అంతతో నాగుడు. వారు త్రిదశులు. అందుచే వారి యెల జవ్వన మంతరింపదు. మనకో యేమున్నది. ఒకతృణముగడచిన యేనుగుతలయంత మారిమి నెత్తిపైబడును. అట్టి మనము వారివలె నెట్లుందుము.

జయం—వారివలె నన్యోన్య ప్రేమపాశబద్ధులమై—

భువ—అబ్బా! ఏమంటిరి? ప్రేమపాశములా? వాటిచే బద్ధులమై యుందుమా? ఎంతమాట! ప్రేమలతాబద్ధులు భార్యను పుట్టినింటకడ దిగవిడచి పరకాంతలతో యిచ్ఛవచ్చినవారలతో యథేచ్ఛముగనే భోగింతురుగదా?

జయం—ప్రియా! మాటిమాటికిని నాయపరాధమే యెంచుచుంటివి. ఇయ్యది భావ్యమా?

ఉ. ఓరమణీ! నినువిడచి ◆ యుంచిన నాయపరాధమెంచి యి
ట్లారడిసేయనేల, తృణ ◆ మైన యికన్విడనాడనంచు నీ
పేరున బాసచేసెదను ◆ వేరువిధంబుగ నెంచబోక నీ
మారు ప్రసన్నచిత్తవయి ◆ మారువిజృంభణ మాపువేగమే.

సీ. ఇక ముందు నీమాట ◆ కెదురాడకేవేళ
సంచరించెదనో శ ◆ శాంకవదన!
ఇకముందు నినువినా ◆ నెవ్వారినైనను
ప్రేమింప నమ్ముమో ◆ వెలదిమిన్న!
ఇకముందు నెన్నడు ◆ త్రుటియైన యెడబాసి
నిలువకుండెద నోవి ◆ నీలవేణి!
ఇకముందు నీయాన ◆ నెప్పుడు దాటక
నడచెదనో రత ◆ నంపుబొమ్మ!

గీ. పెక్కునుడులేల బల్కగా ◆ వినుము నాదు
ప్రాణపంచకమునుగూడ ◆ వలయునెడల

నీదుహ స్తమున నిడెద ♦ నిక్కు వముగ ;
వలయునెడ బానచేసెద ♦ వనరుహాక్షి.

భువ—అవసరమున్న చో— చేయగలిగియున్న చో—నంశయంబు నెక్కు వయే చేయగలరు. పూరుషు లంతటివారుగా రా ?

చ. సరసవచోవిలాసముల ♦ చానల లాలనజేసి హర్ష సా
గరమున దేలియాడి తమ ♦ కార్యము దీరినయంత పూరుషుల్
తరుణుల మోసగించి తమ ♦ దారిని పోదురు ; యిట్టివారి నే
వెరపున నమ్మగానగు న ♦ వీన ప్రియుల్ పురుషాళిగారొకో.

అదనును బట్టి నీవింతదాన వంతదానవని పొగడి- నీసరివారులేరని ముఖస్తుతులొనరించి- దమయక్కరదీర్చుకొని-పిమ్మట మోముజూపు టకైన సమ్మతింపకుందురుగదా ? అదనునజేసిన యొట్టునత్యము లావద మ్మొక్కులవలె తరచుగా పురుషులకు మరపువచ్చుట సామాన్యమే—

జయం—సామాన్యమైన గావచ్చును గాని నేనుగూడ నట్టివాడనే యని తలంచితివా ?

భువ—(స్వగ) అప్పుడే యర్ధరాత్రము మీరవచ్చినది. ఇంకను యీతనితో వాగ్వాద మొనరించుచు గూరుచున్న యెడల జాల మొనర్చితినని నామనోహరుడు కోపగించునేమోగదా ? ఏమిసేయుదును. (ఆలోచనమభినయించి) ఒక్క చిన్ననాటక మాడించెదను. (ప్రకాశముగా) తమ్ముగూడ సామాన్యులలో నొక్కనిగా భావించుటలేదు. గాని యేకారణముచేనైనను తమరుగూడ నట్టులే యగుదురేమోయని సందియ మొదయించుచున్నది.

జయం—నైజస్వభావము మారుట దుస్తరము గాననీకట్టి సందయము దయింపవలసిన పనిలేదు. (దరికేగి) ప్రియా ! ఇంకను నాపై ననుగ్రహము రాదా ? ఇంకనైనను న న్నానందింపజేయు

రాదా ? ఎవ్వఁడెప్పుడని యిన్నినాళ్లవరకు తపించుచున్న నన్నెంతయో ప్రేమతో నీ వాదరింతువని దలంచియుంటినే ! అట్టి నన్ను సంతోషపెట్టనక్కరలేదా ! నీయనుగ్రహము లేని నాజన్మము వ్యర్థముగాదా ?

భువ—(స్వగ) నీజన్మము నిక్కముగ వ్యర్థమే. (ప్రకాశముగ) అంతవరకేల నిప్పుడు—

జయం—(చేయిబట్టుకొని) నిక్కమే. నీ యట్టిభువనమోహిని లభించిన నాజన్మము సార్థకమే యగునుగదా ! ఇంతలో నీవు నాయెడ ప్రసన్నవయినందుల కిదే బహుమానపూర్వకముగా ముద్దిడుచున్నాను. (ముద్దుబెట్టుకొనబోవును. భువనమోహిని దూరముగా నేగును.)

జయం—ఇంతలోనె మరల కోపమువచ్చినదా ?

భువ—కోపమున కవకాశమేమున్నది ? నవ్వువచ్చుచున్నది. ఇన్నిదినములకు గదా ప్రియునిచుంబనమున నా చెక్కిలి తరింపనున్నది గదా యని సంతసించుచుంటిని గాని—

జయం—అట్టియెడ దూరముగా నేగితివెందులకు ? గాని యని యాగితివేమి ?

భువ—ఇంక మీ రెన్నడును నన్ను విడిచియుండరుగదా ? మీయవసరము దీరినపిమ్మట మరల వెనుకటి నాటకమేనా ?

జయం—ఎన్నడును విడనాడియుండను. వలయునెడ బాసచేసెదనంటినిగాదా ! నీ కీసందియమేల కలుగవలెను. నీచెప్పుచేతలలో మెలంగెదను. అందులకు దప్పిన దైవమునకు—

భువ—ఇందులకు ప్రమాణికము లెందులకు లెండు. ఎన్నివత్సరములైన పురుషులు భార్యలనువిడచి బింకములో నుందురుగాని యాడువారికట్టి బింకముసాగవుగదా ?

(సవిలాసముగా సమీపించును.)

జయం.—ఇప్పటికి గదా ధన్యుడనైతిని. (అని భుజముపై జేయివైచి శయనతలము చెంతకు దోడ్కొనిపోవును.)

భువ.—నాథా! ఇంచుక తడవు విశ్రమింపుడు. నాలింతురా (స్వగ) ఈలోపుగా నీతడు పెద్దమ్మ యొడిలో జేరును.

జయం.—నీ సంతోషమున కే నేల యడ్డుపెట్టవలయును. కాని యర్థరాత్రము మీరినది. త్వరలో వీణాగానము ముగింపుము.

(శయనతలముపై జయంతుడు శయనించును. భువనమోహిని సమీపమునగల సోఫాపై గూర్చుండి గానమొనరించుచుండును.)

భువ.—(కొంతకాలమైన పిమ్మట) నాథా! ఈకృతియెట్లున్నది?

జయం.—(నిద్రామోహమున నుండును.)

భువ.—నిద్దుర యావహించినది. (గుప్తముగానుంచిన చేరుమాలుదీసి మత్తుమందున దడిపియుంచిన నీరుమాలు వాసన జూపించెదగాక—రేపటివరకు ఈనిద్రయుండే యుండును గాని మేలుకువరాజాలదు. (అట్లొనరించి) అబ్బా! బ్రహ్మరక్కసునివలె యెంతకును విడువడయ్యెను. అర్ధరాత్రి దాటినది. త్వరలో నేగకున్న నట్టి యంతసేపైన నుండుటకు వీలుండదు. నామనోహరుడు యిూజాలమునకు కోపింపకుండునట్లు మంచిఫలహారములం గొనిపోయెద గాక—

(నిష్క్రమించును.)

తెరవ్రాలును.

---

## తృతీయరంగము.

భువనమోహినిసౌధము యెదుటనున్న బయలు.

[ప్రవేశము— జయపాలుఁడు.]

జయ—

ఉ. హాయిగ భార్యకౌఁగిళుల ♦ యందున నీవు సుఖించుచుండ నే
నీయెడ పూర్వమైత్రి మది ♦ నెంచుచు నీచలిగాలి దెబ్బచేఁ
గాయము కంపమొందునటు ♦ గాసిలుచుంటిని "హేమహేంద్రవా
సాయనమోనమో" యని వి ♦ చారముతోడ సఖావతంసమా!

నే డేలనోగాని కనులు మూతపడుట లేదు.

గీ. బడలి యున్నచో నిద్దుర ♦ బట్టుననుచు
పలుకుచుందురే; అట్టిచో ♦ వనములందు
నడచి శ్రమజెంది యెంతయో ♦ బడలియుంటి
నైన నిద్రలేమికిని లో ♦ నైతినేను.

నిద్రరాకుండుటయే గాక మన మేలకో యూరకయాందోళన మొందుచున్నది. తామరపాకు నందలి నీటిబిందువువలె మానసము స్థిరత్వము గనక చలించుచుండెను. దక్షిణనేత్రమును భుజమును యదరుచుండెను. అక్కటా! యిఁకముం దెట్టికీడు సంభవింపనున్నదో గదా! పరమేశ్వరుఁ డీజయంతజయపాలురకు యింకను యెట్టి సంకటములు గల్గింప సంకల్పించుకొని యుండెనో గదా?

(తెరలో ధ్వని.)

ఏమా చప్పుడు—(పరికించి) అంతఃపురద్వారము తెరువబడియెనే. ఇంతరాత్రివేళ నీతలుపు తీయబడుటకు గత మేమైయుండును! అదే యెవ్వరో యి ట్లరుదెంచుచున్నారు. వారికంటబడు టెందులకు. ఈమాటున డాగి వా రెవ్వరో యరసెదగాక.

(నిష్క్రమించును.)

[ప్రవేశము—భువనమోహిని.]

భువ—ఇంతవరకు జాలముచేసినందులకు నామనోహరుఁడగు మేదర నాయకుఁడు కోపించునేమో ! ఏమిసేయుదును. ఆ బొమ్మ చెముడుకంపను వదలించుకొనుట కింతజాలమయ్యెను. త్వరితముగ మరల తిరిగిరావలయునుగాని లేకున్నచో ముప్పువాటిల్ల గలదని చతుర జెప్పినది. నిక్కమునకు చతుర చతురుపాయ ధురీణయే. కాని నా కిక్కడనుండి ప్రయాణము తటస్థించునవియే తోచుచున్నది. అక్కడికేగినచో మేదరవానిని— నాముద్దులమగనిని మరచి యొక్కత్రుటియైన నుండగలనా ? ఈవిషయమై నావలపువానితో నాలోచించెదగాక.

(నిష్క్రమించును.)

[పునః ప్రవేశము జయపాలుఁడు.]

జయ—ఈలతాతన్వి యెవ్వరై యుండును ! ఈమెపల్కులతీరు బరికింపగా విటునికొరకై పోవుచున్న యభిసారికవోలె గాన్పించుచున్నది. ఇంతియెగాక యంతఃపురమునుండి వచ్చుటచే నాకేలకో సందియముదయించుచున్నది. వెంటాడించి యీామె వృత్తాంత మాద్యంతమరయుదునా ? నాకేల ! అంతఃపురద్వారము తెరచియున్నదిగదా ! లోనికేగి మిత్రుఁడు సుఖియైయుండెనో లేదో చూచివత్తునా ? వలదు వలదు. ఈనిశాసమయమున నంతిపురి ప్రవేశించిన లెక్కకుమీరినయాపదలు తటస్థించును. “బొమ్మచెముడు కంపను వదలించుకొనుట కింతజాలమయ్యెను. ప్రమాణముతటస్థించును. అక్కడ నీయాట లెట్లుసాగగలవు” అనువాక్యములబట్టి యాలోచింపగా నీమె మాజయంతుని—పాపముశమించుగాక. అట్టి తలంపుల కవకాశమీయగూడదు. అంతఃపురపరిచారికయై యుండుననియే నా

యభిప్రాయము. పరిచారికయైనచో యీనిశానసమయమున దొంగతనముగా దనవలపులమగనికై వెడలునా? బహిరంగముగనే పోవుగాక; ఏమో మానసము కీడునే శంకించుచున్నది. ఈమెను వెంటాడి యాథార్థ్యమును నరసెద.

(వెంబడించును.)

తురీయరంగము.

మేదరవాని యిల్లు.

ప్రవేశము—మేదరి వెంకడు.

వెం—అర్ధరేతిరిదాటింది. రాచోరిపిల్లింకా రానేదు. మాపిటికి తప్పకుండొస్తానని—బేగొస్తానని—పొద్దే కబురెట్టిందిగందాయని నిద్దరోకుండా కళ్ళొడుసుకున్నట్టు కూకున్నాను. కాని యీ యేల లాబంవున్నట్టు కాపడ్డంలేదు. తలుపేసి దొంగుండామంటే తొంగుంటే వత్తుందేమో! వత్తే తలుపేసుంటే పిలకెళ్లిపోతుందేంటి. చచ్చినట్టే పిలుత్తాది. ఒక్కేళ పిల్లని సూడకుంటే పిచ్చెత్తినట్టైపోతుంది. అంచేత కూకున్నాను గాని కాపోతేనా మారాజునాగ తలుపేసి తొంగోనూ! ఇంతకీ నా అదురట్టంవల్ల నాకిల్లాంటి రాసపిల్లసిక్కిందిగాని-మరియీవూల్లో నాలాంటోళ్లు తొంభైపస్కొండుమందుంటే యీపిల్లకి నామీదే కన్నడ్డమేం. (చుట్ట వెలిగించి) ఇద్దోయీసుట్ట కాల్సిపారేసేదాకా సూత్తాను. రాకపోతే తొంగుని—పిల్లొచ్చి బొబ్బలెట్టి పిల్చినా పలకను. పతీరోజూ నానొచ్చిందాకా కూకుంటానుగందాయని రేతిరి పొద్దోయినతరోత్తొస్తూంటే మాచావుగావుంది. ఆ—ఆ—ఆ—అద్గోపిల్ల. గజ్జెల గుర్రంలా వత్తోంది. రానీ. యీయాలకొంచెం భయంసెప్పి సూత్తాను. లేకపోతే మెవ్వా

రం ముదిరిపోతోంది. (కొంతసేపూరకొని) అబ్బే! పిల్లరావడం గాదు. ఏదో సవ్వుడైతే వత్తోందనుకున్నాను. (పొగపీల్చి వదలుచు) అబ్బా! నిద్దర కాసి కాకోడం మాంట్టగుంది.

[ప్రవేశము భువనమోహిని.]

భువన—(స్వగతం) అర్ధరాత్రము మీరినట్లున్నది. నా మనోహరుఁడు నే నరుదెంతునని వర్తమాన మంపినట్లు రాకుండుటచే తలుపులవైచుకొని పరుండెనేమో యేమిచేయుదును. మదపిచ్చిచే కారుకూతలరచుచుండు నాతని వంచించి నిద్దురవుచ్చుట కింత తడవైనది. (పరికించి చూచి) అదే నాకొరకే యాతఁడు నిరీక్షించుచున్నాడు. పోయి యాతని కీభక్ష్యములనొసంగి కోపగింపవలదని ప్రార్థించెదను. (సమీపించి భక్ష్యముల నుంచుచును.)

వెంక—ఇంకూంతసేపుండి రానేకపోనావా! ఇంత బేగొచ్చేవేం? నా పానం ఉసికేటట్టు కూకుండి కూకుండి తొంగుందామని లేత్తున్నాను. రోజు కిల్లాచేత్తూంటూ యెవ్వార సాగదు.

భువ—నేడు కొంచె మాలస్యమైనది.

వెం—చమించాలి—చమించకేం జేత్తాం. నువ్వురాకోరిపిల్లవుగందా, మా మెలాకట్టపడ్డానికేం. నువెంత రేతిరికొచ్చినా సచ్చినట్లు నూకుండాలిగందా! ఇంతరేతిరైపాకా తెలిగేసుంటే నెల్లాళ్ళకే సవ్వాలి. ఇంకీయెవ్వారం వొదులుకుంటేనె మంచి దెల్లిపో.

భువ—నేను నాభర్తవచ్చినాడు. అందువలన కొంచె మాలస్యమైనది.

[ప్రవేశము-జయపాలుఁడు వెనుకకొంచెము మరుగున.]

జయ—ఏమిచిత్రము. ఎక్కడి యంతఃపురము. ఎక్కడి మేదరపేట. అక్కడనుండు నీకన్నియును, యీమేదరివానికిని సాంగత్య

మా! దైవమెంతటి ప్రాతికూల్యములనైన ననుకూలపరచి విచిత్రతరంబుగ నాటక మాడించుచుండును గదా!

వెంక—భర్తొచ్చేడు? ఏభర్త.

భువ—నన్ను పెండ్లియాడిన యాతఁడు.

వెంక—ఎక్కడినుంచి. ఇన్నాళ్ళదాకా రాలేదేం?

భువ—వారి గ్రామము నుండి.

వెంక—నా కామాత్రం తెల్సును, ఏవూరనే అడ్గుత.

భువ—పాటలీపురమునుండి.

జయ—హాజయంతా! జయంతా! ఇట్టి పతివ్రతరాలికి భర్తవైతి నని యించుకయు నెఱుంగవుగదా?

భువ—నేను త్వరితముగ పోవలయును. నాభర్త జనుదెంచెనని యెల్ల రానందమున నుండిరి. మంచిమంచి భక్ష్యముల తయారు చేసియుండిరి. వానిని గొనివచ్చితిని.

వెంక—ఇక నువ్విక్కడుండొద్దు. ఇక్కడికింకెప్పుడూ రాకు. మన రాస్యం యెవళ్ళకు తెలిసిన పీకలెగిరిపోతాయి. బేగెళ్ళిపో?

భువ—నిన్ను వదలియుండగలనా? నిన్ను జూడక నొక్కదినమైన నుం డలేను. అట్టినన్ను రావలదనిన నెట్లు?

వెంక—రావద్దంటే బాగుండదని నాకూ తెల్సును. కాని రేపో మాపో నిన్ను మొగుడు పిల్చికెళ్ళిపోతాడనుకో? అప్పుడేంచేత్తావు?

భువ—నేను వెళ్ళదలచుకొనలేదు.

వెంక—నీయిట్టవేంటి? తాడోసి పందినిలాగినట్లు లాక్కుపోతాఁ డు అప్పుడేంజేత్తావు?

భువ—అదే నేనును యాలోచించుచున్నాను. ఇంక నాతండ్రియు నల్లునితో నన్ను పంపకమానఁడు.

వెంక——ఎలాగ యెవ్వారంచెడింది. ఇంక నీదారి నీదే. నాదారి నాదే. మర్నిపోయిన బుట్టా తట్టా అల్లుకోడం మల్లా నేర్చుకొంటాను.

జయ——హా! కాంతలెంతకైనను జాలుదురుగదా! ఇంతకును కట్టుకొన్న కాంతను పుట్టింట నింతకాలము దిగవిడిచినందున నింత పుట్టినది.

భువ——ఇదేనా! నీవు నాకు జేయునవహాయము? నీవేదో ఆలోచించి మంచిమార్గము జెప్పగలవని అనుకున్నాను. మనకూటమిభంగము లేకుండుట కేదైన మార్గమున్నదా?

వెంక——నన్నేంచెయ్యమంటావు? అవ్వూరేదో యెల్లకుండుంటే కొన్నాళ్ళింకా రాహస్యంగా వుండొచ్చును అదీ నేదుగదా! ఇంకీ రెండురోజులు వచ్చిన గుట్టెక్కడ పొక్కుతుందో ఆలోసించూ?

భువ——అవ్వూరువెళ్లకుండుటకు నాకొక్క మార్గమే తోచుచున్నది.

వెంక——ఏంటది.

భువ——నాభర్తను జంపివైచినచో——

వెంక——అమ్మబాబో! నేం జెయ్యలేను. రత్తంనూత్తే నాకెర్రెత్తిపోతుంది.

జయ——హా దుశ్చారిణీ! భర్తనే వధింపనెంచుచుంటివా! పరమపవిత్రమైన క్షత్రియకులమున జన్మించిన నీకిట్టి తుచ్ఛబుద్ధి యెట్లుల వడినది!

భువ——ఈమాత్రము జేయలేవా! నిన్ను లోనికిగొనిపోయెదను.

వెంక——నావల్లగాదు. నిండుపానం తియ్యడమంటే మాటలనుకున్నావేంటి.

జయ___ఆదుశ్చారిణికంటె తక్కువజాతివాడైనను వీని కధర్మమంటు భీతియున్నది.

భువ___పోనిమ్మా. నీకత్తియొసంగుము. నేనే యాతని జక్కబెట్టెదను.

జయ___ఛీ ! ఛీ !! ఛీ !!! నరరూపరాక్షసీ !

వెంక___నాకత్తెందుకు. అక్కడేం లేవ్రా ! ఇది నాపీకమీద కొస్తుం దేమో. పోనీ చేత్తో నరకడ మొదుకు మందెట్టి సంపీరాదు.

భువ___మందుబెట్టిన నింటిలోనివా రనుమానపడుదురు.

వెంక___నరికేసితేమాత్రం అనుమానపడరూ. అప్పుడేం చెప్తావు ?

భువ___అప్పటికేదో చెప్పి తప్పించుకొందును.

జయ___(తనలో) ఏమిచేయుదును. త్వరితగతిం బోయి మిత్రునితోఁ జెప్పుదునా ? ఈమె యాతనికేదో మత్తుమం దొసంగియుండెను. అది సరికాదు. మిత్రుని వేరొకస్థలమునకు దోడ్కొనిపోయి రక్షించినచో లాభముండునేమో ? అదే మరల నామె యేదో పలుకుచున్నది.

భువ___కత్తినిమ్మా. మరల క్షణములో నినుగలిసికొని నీకత్తి నీకొసంగెదను.

వెంక___నాకేమో భయమేత్తోంది. నన్నిడిసెల్లిపోదూ ?

భువ___ఛీ ! పిరికితనముండగూడదు. ఇమ్మా. నీకేమియుభయము లేదు. మరల క్షణములో వచ్చెదను. అడ్డుదారిని బోయిన నెంతసేపు.

వెంక___(భయపడుచు) కత్తినొసంగి పిల్లోయ్ !. నాపీకమీదికి రానీకేం. బేగొత్తావుగాదు.

భువ___క్షణములో తిరిగి వచ్చెదను.

(నిష్క్రమించును.)

జయ—(స్వగతమున) ఈమెయద్దు ద్రోవను పోవుచుదననుచున్నది. ఎట్లుపోవునో వెంబడించి యామెకార్యమున కడ్డుపడి మిత్రుని రక్షింపవలయును.

(నిష్క్రమించును.)

వెంక—పిల్లొచ్చిందాకా సచ్చినట్టు కూకుండాలిగందా! ఏంజెయ్యను. ఇంకోసుట్టైనా తాగుతేగాని నిద్రరాకుండా వుంది. (చుట్ట కొరకు తడుముకొని) లేడిట్లో కెల్లి సుట్ట దెచ్చుకుంటాను.

(నిష్క్రమించును.)

---

పంచమ రంగము.

అంతఃపురము—జయంతుడు పరుండియుండును.

భువన—(త్వరితగమనమున ప్రవేశించి) ఈతడింకను లేచియుండలేదు...మత్తునకు విరుగుడుమందు వాసనజూచినగాని మేల్కొనజాలడని యెరింగియు నామనోహరునితో నిక గొంతకాల ముండనైతిని. కానిమ్ము ఇవుడీతనివధించి త్వరితముగా మరల నాతని జేరబోయెదను. (కత్తినినెత్తి మరల క్రిందకుదింపి) ఇయ్యది పదునుగా నుండకున్న ప్రమాదము గలుగు నేమో? (చూచి) వాడిగలిగియున్నది. ఒక్కవేటున శిరము మొండెమునుండి వేరగును (సమీపించి నరుకబోయి, ఆగి) ఏమిది! ఎంతటిఘోరకృత్యమొనర్ప సిద్ధపడుచుంటిని. వలదు. ఇంతటిదుష్కార్య మాచరింపను. సుఖమైనవదలుకొందును. సుఖమును వదలుకొనుటయేనా? కట్టా! దుర్భరము. సౌఖ్యము లేని జీవితమెందులకు? నాసౌఖ్యాంకురవిచ్ఛేద మొనరించుకొనుటన్యాయమా? వలదు. నాసౌఖ్యమున కాటంకముగలుగరాదు. నాసౌఖ్యమున కాటంకముగల్గిన జీవితమే పోవలయును

గాని దుఃఖించుచు మనియుండజాలను. నిశ్చయము. నాసౌఖ్యమను భూజమును కూకటివేళ్లతో గూలద్రోయు నొక్కని వధించుటే న్యాయము. ఇంక సంశయింపంబనిలేదు. (కత్తినెత్తును. తెరలోచప్పుడు.) ఏదోచప్పుడగుచున్నది. (మరల నాగి) నిశ్శబ్దముగనే యున్నది. ఊరక భ్రాంతిచే చప్పుడైనట్లుగా వినవచ్చినది. ఇంక విలంబమొనర్చుటచేలాభముండదు. (కత్తినెత్తి జయంతుని శిరమునఱకును.)

[ప్రవేశము—జయపాలుఁడు త్వరితముగ.]

జయపాలుఁడు—

గీ. ఓలతాంగిరో సాహస ♦ మూని తుచ్ఛ
సౌఖ్యముల కాసజెందిని ♦ ష్కారణముగ
ప్రాణనాథు జేచేత జం ♦ పంగవలదు
నిందభరియించి తదుపరి ♦ నిలువలేవు.

భువనమో—(స్వగతమున) ఎవ్వడీతఁడు. నాయంతఃపురమున కెట్లు రాగలిగెను. (ఇంచుక తడవుండి) ఎంతమందమతినైతిని. మరల పోవలసియున్నదిగదా? యని తలుపులబంధింపక నుపేక్షచేయుటచే గదా యింతగల్గినది. కానిమ్ము. ఇదియు కొంతమేలె. నానేర మంతయు నీతనిపై మోపి చిత్రముగా తప్పించుకొందును. ఎంతచక్కని యుపాయము స్ఫురించినది.

జయ—(జయంతుఁడు నరుకబడియుండుట జూచి) హా మిత్రమా! జయంతా! ఇంతలోననే నీకు నూరేండ్లును నిండినవా? (భువనమోహినిని జూచి) కులటా! ఎంతఘోరకార్యమాచరించితివి. దయాదాక్షిణ్యములు లేవా? మానాభిమానములు లేవా? సుక్షత్రియకాంతవై జన్మించి నీచకులజుఁడగు మేద

రితో సాంగత్యము నలుపుటకు సిగ్గుబిడెములు లేవా? కన్న వారికిని చేగొన్నవారికిని యట్టిట్టిదనరాని యపయశము ముప్పతిల జేయుటకంటె వ్యభిచారమున సుఖంబుండదని యెఱుంగవా? ఇంతవివేకము లేకపోయెనా? నింక ప్రాణమును బలిగొంటి వే? నిజరూపపిశాచమా! ఇంతటిపాపమున కొడిగట్టియైన సుఖంప దలంచితివా? నీవు మాత్రమెంతకాల ముట్టిగట్టుకొని యూగులాడెదవు? క్షణభంగురములైన యైహికసౌఖ్యముల కాశించి పాపమార్జించుటయే శ్రేయమని భావించితివా? ఈ హత్యాపాతకము నిన్నూరకే విడచుననియే భావించితివా? ఎవ్వరును చూచుచుండలేదని దలంచితివా? పంచభూతంబులును, సూర్యచంద్రములును, సర్వాంతర్యామియగు నాపరాత్పరుండును నీచేయు దుష్కృత్యమునకు సాక్షులుసుమా? మఱువేదన కోరువలేక హింసకావించితివె? రేపు యమలోకమున పెక్కురు భటులు నిను పరిపరివిధముల బాధింప నెట్లు సహింపగలవు? హత్య— హత్య— దారుణహత్య! అందునను ప్రాణనాథుని— అమాయకుడగు జీవితేశ్వరుని— నతికేడుగడయగు పతిని— నిద్రావస్థయందుండ వధించితివె— దుర్మతీ! కులటా? నీయట్టిదుర్మార్గురాలు తమగర్భమున జన్మించెనని నీ తల్లిదండ్రులెంతచింతింతురో గమనించితివా? ఈగుట్టు వెల్లడికాకుండుననియే భావించితివా? రంకుతనమును దొంగతనమును యెంతయో కాలము దాగవని తెలియనిదానవా?...

ఛీ! నీముఖమును జూడరాదు. కార్యము మించిపోయినది. నీశయనాగారము తెలిసికొనుట కష్టమయ్యెను. లేనిచో నీ యభాగ్యుని రక్షింపగలుగుదునేమో! హా మిత్రమా! జయంతా! నిముషమైన ననువిడువలేనివాడవుగదా? ననువిడచి

దివంబున కరిగితివా? నిను జూసి నిలువజాలకనేగదా? వెను వెంట జనుదెంచితిని. అట్టిచో నను విడచి పోవదగునా?...

భువ—(స్వగతము) ఈతఁడెవ్వరో నాగుట్టుమట్టులన్నియు నెఱింగియున్నటుల దోఁచుచున్నది. ఈతడిచటనుండి వెడలుటకుమున్నె యీతనిపై నీనేర మారోపింపవలయును. (ప్రకాశముగా) భటులారా! రండు. రండు. ఈజడదారి యెవ్వడో నాశయనాగారమును ప్రవేశించి నా నాథుని హింసించుచున్నాడు. త్వరపడుడు.

[ప్రవేశము—భటులు.]

భటు—ఎవరు మముబిలచినది?

జయపా—(స్వగతము) మరియొకపాపమున కొడిగట్టుచున్నది. కాని మ్మ్మ. అన్నిటికిని భగవంతుఁడే గలఁడు. కాని ఈమెచారిత్రమువలన కాంతలెంతకైన దగినవారనుట స్పష్టమైనది.

భువ—భటులారా! ఈతడే నా నాథుని కుత్తుక నుత్తరించెను.

జయపా—భటులారా! నేనే యీతని వధించిన ముష్కరుడ. బంధింపుడు. (స్వగ) మోహినీ? నాడు మాలో మాకు కలహమును బెట్టితివి. అంతతో నూరకుండక మాజయంతుని పాత్రకీ జగన్నాటకమునందు పనిలేకుండ జేసితివి. ముందెట్లు చేయగలవో?

(జయపాలుని భటులు బంధించి గొనిపోవుదురు. తెర వ్రాలును.)

ఇది ద్వితీయాంకము.



# జయంతజయపాలము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

చెఱసాల—జయపాలుఁడు.

జయపాలు—

సీ. ఘనమైననెడబాయ ♦ జాలనిమైత్రికి
భంగంబుత్రుటిలోన ♦ ప్రాప్తమయ్యె
విశ్లేషమోర్వక ♦ విపినవీథులలోన
కడగండ్లకోర్చుచు ♦ నడువనయ్యె
ప్రాణపదంబుగ ♦ వరికించుహితుని య
కాలమరణంబు ♦ గాంచనయ్యె.
భరియింపగారాని ♦ వాదుభరించుచు
చెఱసాలలోన కృ ♦ శింపనయ్యె
ఇన్నిదుఃఖంబులెట్లో భ ♦ రించినాఁడ
గాని యీపరాత్పరవియోగ ♦ భరముక్క
టకట భరియింపనోప; క ♦ టాక్షముంచి
వేగయాతనిఁగూర్పుము ♦ వేడువాఁడ.

ఆహా! దైవవిధి యిట్లున్నదిగదా! ఈకారాగృహంబున జిక్కి యింక నెట్టి యిడుములబడవలసియున్నదోగదా? ఆభూపాలుఁడు, పుణ్యాత్ము డగుకతంబున వెంటనే నన్నురిదీయనానతిచ్చెను గాని యదెక్కడి వాఁడో యాతనికుమారుఁడట పానకములోని పుడకవలె నడ్డమువచ్చి నాకీడలేనిదుఃఖ మొనగూర్చెను. లేకున్నచో ఈపటికి నాయ

నుంగు మిత్రునితో గలసి హాయిగవిహరించియుందునే ? ఇంకను యెన్ని దినంబు లీ చెఱసాలలోనుండవలయునో ? జయంతా ! జయంతా !! నీ ముఖారవిందసందర్శన మింక నాకీజన్మంబున గలుగదా ? అక్కటా ! పయోముఖ విషకుంభ మని యెఱుంగక, గోముఖవ్యాఘ్రమని యెఱుంగక, దరిజేరి అక్కటా ! అకాలమరణంబునొందితివా ? కట్టా ! ఎంతని తలపోయుదును. ఆకులటయభిప్రాయ మెఱింగినంతనే బయలుదేరి యంతఃపురము జేరితినా నామిత్రుని సంరక్షించియుందునే ? అట్లొనర్పక మూఢుడనై, ప్రవర్తించితినే. అట్లాలసించినందులకే, యిట్లనుభవించుచున్నాడను.

వ్యభిచారిణీ ! కులటా ! ఎంతకాల మీరహస్యవర్తనము దాగి యుండునని తలంచితివి. ఇపుడెట్లో రాజభటులను మాయబుచ్చి నన్ను చెఱద్రోయించితివి గాని యింతకును నీకు సంభవించెడిమహాపాతకము నుండి యెట్లు తప్పించుకొనగలవు ? అహా ! ఎట్టికాలమరుదెంచినది ? పతియే దైవమనిభావించి సేవించుచుండుకాలము గతించినది. ఉపపతికై నాథునివధించుకాలము సమరుదెంచినది. కట్టా ! ఎంతవిపరీతమగు మార్పుగలిగెను. ఇది కలిప్రభావము గాబోలును. ఇదియే కలియుగంబునకు ప్రారంభమై యుండునేమోగదా ! అదే యెవ్వరో యిట్లరుదెంచుచున్నట్లు అడుగులచప్పుడు వినవచ్చుచున్నది.

[ప్రవేశము—దాసి.]

జయపా—ఇపుడీమె యిచటికేలవచ్చెనోగదా ?

దాసి—అబ్బా ! రాణివాసములోని కొలువుకంటె కొంగుజాచి యాచించుకొనుటయే మేలుగదా ? లేచినదిమొదలు రాత్రిరెండు జాములవరకేదో యొకపని చెప్పుచునేయుందురు. ఈమధ్య నల్లునిగారి మరణమువలన రెండురోజులు హాయిగా గూర్చుంటిమి. మరల నిదిమొదలు, అందునను యీభువనమోహిని

యొద్ద పరిచర్యజేయుట మహాకష్టము. నేనింటికిబోవునపుడా వార్త నాతనికి జెప్పిపోవుదునమ్మా యని యెంతజెప్పినను వినక, నిప్పుడేపోయిరమ్మన్నది. మైలుదూరముపోవలె. మరల గాళ్లీడ్చుకొనుచు రావలెను. ఏమిజేతును. పోనీ నౌఖరీవదలివేయుదుమనిన జీవనయాత్ర గడచుటెట్లు?

(నిష్క్రమించును.)

జయపా—ఈదాసీమాటలవలన నీమెయే యనుసంధావకర్త్రయైయుండునట్లు తోచుచున్నది. ఇప్పుడిది యా నీచునకొకవార్త గొనిపోవుచుండెనని తోచుచున్నది. ఈమెచెప్పిన దూరముగూడ నే నారాత్రి నడచిన దూరమునకు సరిపోవుచున్నది. ఆలోచింపనీభువనసుందరి నేడు వానిగృహమున కేగుననియే తోచుచున్నది. ఏమిదెలిసిన నేమిప్రయోజనము. మిత్రమా! జయంతా! ప్రాణమిత్రుడనని పెద్దపేరుపెట్టుగొని నిన్ను రక్షింపజాలనైతినిగదా?

[ప్రవేశము :—విజయసేనుడు మాటున.]

విజయ—(స్వగతమున) ఈతడెవ్వడో నిన్ను రక్షింపజాలనైతినిగదా! యనుచున్నాడు కంఠస్వరమునుబట్టిజూడ నాడు నాసోదరిభర్తనువధించిన జడదారికంఠస్వరమువలె నున్నది ఈతురుగు ననేనిలచి యీతనిసంభాషణ మాలించెదగాక.

జయపా—నిన్ను త్వరలోజనుదెంచి కలిసికొందును. అప్పటకేని నాపై నీకనుగ్రహముగాకలదు. పరాత్పరా! సవిత్రీ! నీకిదితగదు. నన్నుగూడ గొనిపొమ్ము.

(ఎదుటకు జనుదెంచి.)

విజయ—మరణమాకాంక్షించుచుంటివేల? నీవెవ్వడవు?

జయ—అయ్యా! నేనొకమందభాగ్యుడను.

విజయ—మరణమేలకోరుచుంటివి ?

జయ—నేట రేపట నురిదీయబడవలసి యుండుటచే.

విజయు—ఎట్టి నేరమును జేసితివి ?

జయ—అయ్యా ! మీరెవ్వరో నూతనులవలె నట్లడుగుచుంటిరేమి ? అంతఃపురము ప్రవేశించి జయంతకుమారుని వధించిన నేరమునకై.

విజయు—సురక్షితమైన యంతఃపురమెట్లు ప్రవేశించితివి ?

జయ—ఆ ప్రశ్నమునకు భూపాలుఁడు చిత్రకేతుఁడే సమాధానమొసంగగలడు గాని నేనెట్లొసంగగలను. ఆసభయందీ ప్రశ్నమొక్క యువరాజుతక్క నెవ్వరును యడిగియుండలేదే ?

విజయు—ఓయీ ! నిక్కముగా నీవాతని వధించితివా ?

జయ—అట్లే వారు భావించియుండిరి.

విజయ—వారు పొరబడియుందురు.

జయ—అటులైన తమ యభిప్రాయమేమి ?

విజయు—నీవు నిర్దోషివనియే నాయభిప్రాయము ?

జయ—అటులైన నీయపరాధమున దోషియెవ్వరు ?

విజయ—నీ ప్రశ్నములు బాగుగనేయున్నవి. నేనడిగిన ప్రశ్నకు నావలననే సమాధానమపేక్షించుచుంటివా ? పోనిమ్ము. నీచరిత్రమంతయు నిక్కముగా నెఱింగింపుము.

జయ—నిక్కమే వచించువాడెవ్వఁడు. ఎన్నడో హరిశ్చంద్రుడొక్కడుండెనేమో గాని యిపుడట్టి సత్యసంధులు గాన్పింపరు.

విజయ—(దుస్తులనుమార్చి) ఓయీ ! ఇపుడైనను గుర్తింపగలవా ? ఇంక నాసందియముల దీర్చుము. నేనింతకుముందే జనుదెంచి నీపలుకుల గొన్నిటిని వినియుంటిని. వానివలన నీవు నిర్దోషివని గ్రహించితిని. యథార్థమెఱింగింపుము. నాడానసభారంగమున

నీమోము దిలకించినంతనే నాకు నీవు నిష్కంపు సన్యాసివి గావని దోచెను. మరియు నిర్దోషివని నిశ్చయించి నాయభి ప్రాయమును ఋజువుచేయుటకు గడువడిగి యుంటిని.

జయ—అయ్యా! కడచినదాని కింత వితర్కమేల?

విజయ—ఒక్క నిర్దోషిని దోషియని శిక్షించిన నెంతటిపాపము గల్గునో నీకెఱుంగవా?

జయపా—అట్లైన మీసోదరియే దోషియని తలంచితిరా?

విజయ—ఎట్లు నిర్ధారణ చేయుటకును దోపకున్నది. గాన రహస్య ముగ వెలిబుచ్చుము.

జయ—ఈ నానోటవచింపజాలను. ఎట్లును జచ్చుచుంటినిగదా? ఈ పాపమునకేల యొడిగట్టవలెను?

విజయు—తగిన నిదర్శనము జూపగలవా?

జయ—లాభ మేమి?

విజయు—నీకు విడుదలయగును. ద్రోహులు శిక్షింపబడుదురు.

జయ—అట్లైన నేగోరునది నాకు ప్రాప్తింపదే?

విజయు—ఎంతపిచ్చివాఁడవైతివి. నీవు కోరుకొనినంతమాత్రమున మరణము సంభవించునా? జయంతుఁడు తాను నాటిరేయి శయనాగారమున మరణింపనుంటినను యెఱుంగునా? ఎవరి సుకృత దుష్కృతముల ననుసరించి వారివారి యాయుః ప్రమాణములు నిర్ణయింపబడును. ఆయువు పూర్తియగు నంత వఱ కెవ్వడును మరణింపఁడు. ఆయువు నిండినపిమ్మట జీవింపజాలఁడు. కావున నిందు సత్యము వక్కాణింపుము.

జయ—తప్పదా?

విజయు—తప్పదు.

జయ—ఆవల విచారింతువుసుమీ?

విజయ.—విచారమున నవకాశములేదు. దోషులు శిక్షింపబడిరిగదా యని సంతసింతును.

జయ.—అటులైన నీవు ప్రచ్ఛన్నవేషమును ధరించి నాతో స్వేచ్ఛగ నీరేయి గడుపవలయును.

విజ.—అటులనే! సూర్యాస్తమయమైన పిమ్మట జనుదెంచెదను.

(నిష్క్రమించును.)

జయపా.—మరల నిదియొకటి సంప్రాప్తమైనది. ఇయ్యదిగూడ పరమేశ్వరివిలాసమేగదా? అతఁడే యీరాజనందనుని నన్ను రక్షింపబంపియుండెనని తలంతును.

గీ. అంతుదరిలేని దుఃఖాబ్ధి ♦ యందుజిక్కి
మునిగితేలుచు ప్రాణముల్ ♦ పోవనున్న
నన్నురక్షింప రాజనం ♦ దనునినేడు
బంపియుండెను నాతడే ♦ భవ్యకృపను.

నామరణ మాతని యిచ్ఛావిలాసమునకు విపరీతమగుటచే నన్ను రక్షింపయీతని బంపియుండును. లేనిచో నాడే నాకు మరణము సంప్రాప్తించి యుండును. కానిమ్ము, జరుగనున్నదెట్లును జరుగకమానదు. పరాత్పరా! ఎల్లరును నీచేతియందలి కీల్బొమ్మలై నీవెట్లాడించిన నట్లాడుదురుగదా?

అనుబంధము.

తెర వ్రాలును.

## ద్వితీయరంగము.

చెఱసాల కించుకదూరముననున్న బయలు.

[ప్రవేశము :—విజయసేనుఁడు, జయపాలుఁడు]

జయ—రాకుమారా! నీవు నాయనుజ్ఞగొనక నెట్టియకార్యమును చేయనని ముందుగ వాగ్దానమొసంగుము. లేనియెడల నేను చెరసాలలోని కేగెదను. తదుపరి పరమేశ్వరసంకల్ప మెట్లున్న దో యట్లు జరుగగలదు.

విజ—మంచిది. నీచెప్పినచొప్పుననే వర్తించెదను. కాని, ఇదేమి! నా సోదరి యంతఃపురము చెంతకు గొనివచ్చితివేమి?

జయ—నన్ను నీవడిగిన ప్రశ్నములకు దగిన సమాధాన మీదావున నుండి పరికించిన తెలియగలవు. అదే ఆమాటునకుబోయి యందుగూరుచున్నయెడల సర్వమును మనకు గాన్పించునుగాని మనమెవ్వరికిని గాన్పింపము.

విజయ—(స్వగతము) ఈతనివిపరీతచర్య కర్థము కాన్పించుటలేదు. ఆ కటికిజీకటిలోనికి నను కొనిపోయి హానిసేయసంకల్పించి యుండడుగదా? అయినను యీతడు- నిరాయుధుడైన యీతఁడు నాపై దిరుగబడిన నే నీతని సులభముగ నోడింపగలను.

జయ—రాకుమారా! ఏమాలోచించుచుంటివి?

విజ—మంచిదటుబోవుదము రమ్ము. నీపలుకులకర్థము స్ఫురింపక యాలోచించుచున్నాడను.

(నిష్క్రమింతురు.)

[ప్రవేశము :—భువనమోహిని.]

భు—అబ్బా! అర్ధరాత్రము మీరవచ్చినదిగాబోలును. రెండుదినములనుండి నావలపుకానిని కలసికొనుటకు వీలుచిక్కదయ్యెను.

నేఁడైనను త్వరితముగా తిరిగిరావలయును. కట్టా! ఆపాడు మగఁడు చచ్చియు నింకను నన్నే బాధించుచున్నాఁడు. (ముందునకునడచి నిష్క్రమించును.)

[ప్రవేశము:—విజయసేనుఁడు, జయపాలుడు.]

విజయ—ఓయీ! ఆమె నాసోదరియగు భువనమోహినికాదా? భర్తృమరణముచే దుఃఖితయై తన జీవనమునకు స్వస్తి జెప్పుకొనుటకుగాఁబోలు నెచ్చటికోపోవుచున్నది.

గీ. భర్తృమృతిఁజెందెను దుఃఖ ♦ భరముతోడ
జీవితముఁరోసి యల్లదె ♦ పోవుచుండె
పోయివారించి యొకక్షణం ♦ బునను వత్తు
ననఘ, సెలవిమ్ము నాకు మా ♦ రాడబోక.

జయ—(అడ్డుకొని) ఓయీ! ఇంత త్వరపడెదవేఁ? ఆమెను మనము రహస్యముగ వెంబడింతుము.

విజ—ఎందులకు?

జయ—మరల మొదటికి వచ్చుచుంటివా? నేను చెప్పినట్టు చేసెదనని మాటయిచ్చి యన్యథా చరింపదలంచుటదగునా? అటులైన పొమ్ము. నేను కారాగారమునకే పోయెదను.

విజ—క్షమింపుడు.

జయ—మన మామెకు గనబడకుండ వెంబడింపవలయును. రమ్ము పోవుదము.

(నిష్క్రమింతురు.)

[పునః ప్రవేశము:—భువనమోహిని.]

భువ—నే డదేలకోగాని యెంతనడచినను మార్గము తరుగకున్నది. మన మేలకో తత్తరపాటుఁజెందుచున్నది. కారణ మేమైయుండునా? (అడుగులచప్పుడు) (వెనుకకుదిరిగిచూచి) ఎవ్వరో

వచ్చుచున్నట్లున్నది. మాటున డాగెదగాక. (డాగి, ఒకనిముషముండి వెలికరుదెంచి) నాభ్రాంతియే యట్లు దోపించినది గాని యది పదములచప్పుడుకాదు. త్వరితముగ బోవుచున్న యాతఁడు కోపించు నేమోగదా ?

(నిష్క్రమింతురు.)

[ప్రవేశము జయపాలుఁడు- విజయసేనుఁడు.]

విజయ—ఓయీ ! ఈమె యీయర్ధరాత్రమున నెచ్చటి కరుగుచుండెనో ? ఇంకను ఎంతదూరము మన మీమెను వెంబడింపవలయును

జయ—తినబోవుచు రుచులడుగనేల. ఇంకకొన్ని నిమేషములోపిక పట్టిన నన్నియు నీకే తెలియగలవు.

విజయ—పోనిమ్ము. ఆమెను కలిసికొని యెచ్చటి కేగుచుంటివని ప్రశ్నింతును.

జయ—మరల మొదటికి వచ్చుచున్నావు. అట్లైనచో జయంతుని వధయందలి రహస్యము దెలియుటకుమారు మరింత యగాధమున బడిపోవును. అదే యామె మళుపుదిరుగుచున్నది. జాలమొనర్చినచో నామె మన కనుగప్పి పోవును. రమ్ము.

(నిష్క్రమింతురు.

తెరయెత్తబడును—మేదరియిల్లు.

[చుట్టకాల్చుచు వెంకడు కూర్చుండియుండును.]

వెంకడు—(పొగవదలి) వత్తానని కపురంపిండిగందా యని కన్నొడుచుకుని కూకున్నానుగాని, నత్తె పెమాణంగా నిద్రగొస్తాంది. ఊళ్లోవాళంతా జయంతుణ్ణి సన్నాసిగాడెవ్వడో సంపేసనిసెప్పుకుంటారు. కాని నామోహిని వత్తేకాని విజం బయలడదు. ఆయేళే తెల్లారకుండా కత్తట్టుకొత్తానని యెల్లింది

అదేశోకగా పోనాదేకాని కపురేనాయింపిందికాదు. ఇది నాపీకి మీదికొత్తుందేమోయని భయమేత్తోంది. వద్దువద్దంటూంటే పని కానిచ్చేసి బేగొత్తాసని తుర్రున పారిపోనాది...(అడుగులచప్పుడు.) అద్గో! గజ్జలగుర్రంలా గంతేసుకొని నడిసొత్తోంది.

[ప్రవేశము భువనమోహిని]

భువ—(వెంకని సమీపించి) నాథా! అనుకొన్నపని నిరాటంకంగా జరిగింది. ఇకనేను నీదానను.

[ప్రవేశము. మాటున జయపాలుఁడు. విజయసేనుఁడు.]

విజయ—ఏమిది! నాసోదరి కట్టకడపట పట్టణమంతయు విడచి యూరికిచిగురనున్న మేదరివాడ ప్రవేశించి యొకనీచుని యింట ప్రవేసించినదా?

జయ—అయ్యా! ఓరిమికలిగి యుండవలయును. లేకున్న మనకార్యము రసాభాసమగును. ఇదే యీప్రదేశమున నున్న వారిసంభాషణమంతయు మనకు వినబడును. వారు మనకు స్పష్టముగ గాన్పింతురు. కాని వారికి మనము గాన్పింపము.

వెంకఁడు—ఏంటే సంపేసినావా? ఎల్లా సంపేసేవు. ఇన్నాళ్లూరానేదే. బేగిసెప్పు. ఊరోళ్లంతా సన్నాసిగాడెవడో సంపేడంటారేటి.

జయ—యువరాజా! సావధానమనస్కుడవై యాలింపుము.

భువ—నీవద్దనుండి కత్తి గైకొనిపోయి యొక్క వ్రేటుతో యాతని నంతమొందించితిని. కాని యంతలో నెవడో యొకసన్యాసి నేనింకా చంపలేదని తలచి వలదు చంపవలదని వారించుచు లోనికి జనుదెంచెను.

వెంక—ఓయిబాబమ్మో! నాపీకిమీదికి తెచ్చేవంటే. నేమొదటొద్దన్నదంటే.

భువ__నేనంత వెర్రిదాననను కొంటివా? ఒక చిత్రముగు మాయను పన్నితిని.

జయ__యువరాజా! సావధానము.

విజయ__ఓయీ! సర్వమును బోధపడినది.

గీ. సిగ్గుబోనాడి యువపతి ♦ జేరుకొఱకు
జీవితేశ్వరుజంపి తా ♦ జేసినట్టి
నేరమును మోపె నీపైన ♦ నిక్కువముగ
ననుచు బాగుగ దెలియంగ ♦ నయ్యె సఖుడ.

సఖా! మన్నింపుము. నీపై వృథాయనుమానపడితిని. ఈకులకళంకిని__

గీ. అమల మాచు కళంకమా ♦ వంతలేక
వన్నెగాంచినయట్టి మా ♦ వంశమునకు
దీరగారాని యపకీర్తి ♦ దెచ్చె; వెన్ను
చెఱకునను బుట్టి తీపిని ♦ చెఱచునట్లు.

జయ__మన ప్రసంగము నటుంచుము. వారేదో మాటలాడుచున్నారు గమనించుము.

శంక__మాయ పన్నెశావా! ఏంటామాయ. ఎంతాలోసించినా తెల్డంలేదు.

భువ__అంతనేను భయమును పోవిడచి, ఓభటులారా! ఈసన్యాసియెవ్వడో నాభర్తను జంపుచున్నాడు. వేగవచ్చి రక్షింపుడని మొఱ్ఱబెట్టితిని. రాజభటు లరుదెంచి యాతని జెఱసాలకు గొనిపోయిరి.

విజయ__మిత్రమా! ఈదుర్మార్గురాలి నూరక విడువ బుద్ధిపుట్టలేదు. ఇదేపోయి వారిరువురను జంపివత్తును. (పోబోవును.)

జయ__పాపము. జంపిన మహాపాతకము గల్గును.

విజయ__పాపమా! రానిమ్ము.

గీ. నేరమెఱుంగని వారి ని ♦ ష్కారణముగ
శిక్షజేసినదోషంబు ♦ జెందుగాని
కరకుమనమున తనమనః ♦ కాంతుజంపు
కులట జంపిన యఘము చే ♦ కూరదెవుడు.

భర్తృప్రాణములకు మారియైననారిని వధించుటకాదుగదా? చిత్రవధ యొనరించినను పాపముచేకూరదు.

ఉ. పాపమువచ్చుగాక, నిజ ♦ భావమెఱుంగక లోకమెల్ల నన్
పాపిగనెంచుగాక కల ♦ బంధులు దిట్టిన దిట్టుగాక సం
తాపమునొంది కోపమున ♦ తండ్రి వధింపగ బంపుగాక యీ
పాపిని భర్తృహంతకిని ♦ పట్టివధింపక మాననియ్యెడన్.

(పోబోవును)

జయ—మిత్రమా! ఇంచుక శాంతింపుము. నీకును నాకును దెలిసిన యీరహస్య మితరులకెట్లు దెలియును. అయిన త్వరపడిన ప్రయోజనమున్నదా?

విజయ—ఇంక శాంతమువహింపజాలను. (ఈలవేయును నలువురు రాజభటులు ప్రవేశింతురు.)

భువ—ఇదేమి! చిత్రముగానున్నదే. ఎవ్వడును యిట్టినిశీథమున నిచ్చటగస్తితిరుగరే? (నలుమూలల పరికించును. విజయసేన జయపాలురు గాన్పింతురు)

అయ్యో! ఇంకేమున్నది. నారహస్యము బయలైనది. ఇంకేమిదారి. అదే నాసోదరుడును నాటిరాత్రి ననువారించిన సన్యాసియు నను వెంబడించి యిచ్చటికరుదెంచినారు.

వెంక—ఏంటీ! మీఅన్నయ్యొచ్చేడీ. గుట్టుబైలడైపోయినాదీ. నాపీక మీదకిదంతా దెచ్చేసేవూ.

విజయ — ఓభటులారా! ఆయింటియందున్న మేదరిని యాస్త్రీని తక్షణమె బంధించి కారాగృహమున నుంచుఁడు.

రాజభటు — చిత్తము. (లోనికి ప్రవేశించి వెంకని, భువనమోహినిని బంధించి తీసికొనిపోవుదురు)

విజయ — మహాత్మా! తమవలనుగదా! యీరహస్యము వెల్లడైనది.

జయ — ఓయీ! నీవట్లుభావింపవలదు. ఎట్లో యీరహస్యము లోకమునకు దెలియకపోదు. ఇందు నేను నీకొనర్చినసహాయమేమున్నది. అర్ధరాత్రము. అర్ధరాత్రమువిూరవచ్చిన్నది. ఇంకనుజాగొనరించిన సుకుమారుఁడవగు నీవు శ్రమజెందెదవు.

విజ — నా శ్రమకై నీవుచింతించుచుంటివా! నాకు మరణదండనమునకు పాత్రుడైన యొక నిర్దోషిని రక్షింపగలిగితినిగదా యను తృప్తిచేకూరినది. అయినను మనమిచ్చటచేయవలసినదేమున్నది. పోవుదమురమ్ము. నేటికినీవుగూడ నాసౌధమునే విశ్రమింతువుగాక.

జయ — వలదు. నా చెరసాలకేపోయెదను. క్షమింపుము. (స్వగతము)

గీ. వరసగా మాదుచరితా ♦ ప్రబంధమందు
ముగియగానుండె నంకముల్ ♦ మూఁడు; ఇంక
నెట్లు జరగగలదొ విధి ♦ యెట్లొనర్ప
నెంచియుండెనో, సుంతయు ♦ నెఱుగరాదు.

(ఇరువురును నిష్క్రమింతురు)

తృతీయరంగము.

చిత్రకేతుని దర్బారు.

(చిత్రకేతుఁడు, మంత్రి విజయసేనుఁడు.
కూర్చుండియుండ తెరలేచును.)

చిత్ర—విజయా! జయంతకుమారుని వధించిన యాజడదారి కారాగృహంబున నెట్లుండెనో కనుగొంటివా? నాలుగుదినముల వఱకునిక్కువంబరయుటకు గడువడిగితివే! ఏమైన దెలియవచ్చెనా? అతఁడంతఃపురము ప్రవేశించుటకుగల కారణమెద్దియో దెలిపియుండెనా?

విజయ—చిత్తము. సర్వమును కనుగొంటిని. ఈదినమున నాతని నేరమును విమర్శించిన విమర్శింపవచ్చును.

మంత్రి—పునర్విమర్శన మెందులకు. నాడాతడే దోషియని తేటతెల్లముగా తెలియవచ్చెనుగదా?

విజ—మంత్రివర్యా! తమరిందు పొరబడియుందురు.

చిత్ర—అయిన నీయభిప్రాయమేమి?

విజ—సర్వమును తమకే విశదముకాగలవు. తినబోవుచు రుచులడుగనేల?

చిత్ర—ఈనేరమున నాతఁడు నిర్దోషియనియే దలంచుచుంటివా?

విజ—నిస్సందేహముగ.

మంత్రి—అదెట్లు?

విజ—సేవకా! నిన్నరాత్రి చెఱసాలలోనుంచబడిన స్త్రీని పురుషుని జయంతుని జంపెనని కారాగృహమున నుంపబడిన సన్యాసిని సత్వరముగ నిచ్చట ప్రవేశపెట్టవలసినదని కారాగృహాధికారి కెఱింగింపుము.

(సేవకుడు నిష్క్రమించును.)

చిత్ర—కుమారా! ఎవ్వరో స్త్రీయనుచుంటివే, ఆమెకుగూడ నిందు భాగమున్నదా? ఆపురుషుఁడెవ్వరు.

విజయు—జనకా! వేరుగఁజెప్పనేల? కొలదినిముషములలో సర్వమును తమరు తెలియఁగలరు. అదే రాజభటులు నేరస్థులను దోడ్కొనివచ్చుచున్నారు. వారివలననే సర్వమును దెలియును.

[ప్రవేశము సన్యాసివేషమున జయపాలుఁడు. భువనమోహిని. వెంకడు. రాజభటులు.]

(రాజభటులు నేరస్థులను భూపాలునకెదురుగ నిలువబెట్టుదురు.)

చిత్ర—కుమారా! విజయా! ఆమె నిసోదరియగు భువనమోహిని కాదా! ఇక్కడికేలరావలసి వచ్చినది. నేను పొరబడుట లేదుగదా?

విజయు—జనకా! ఈవిషయమున తమరు పొరబడుటలేదు. ఆమె మన భువనమోహినియే యగును. ఇక్కడికామె యెందులకు గావలసివచ్చినదో యామెనే యడుగుటలెస్స.

చిత్ర—(స్వగతమున) ఏమిది కుమారు డిట్లనుచున్నాఁడు! ఏలనో నామనసు చేయివెట్టి కలంచినట్లు తత్తరమందుచుండెను. కానిమ్ము; ఆమెవలననే సర్వమును దెలిసికొందును. (ప్రకాశము) అమ్మా! భువనమోహినీ! ఇట్లు నీవరుదెంచితివేల? కుసుమకోమల సదృశములగు నీచేతుల కానిగళము లేలగల్గెను.

భువ—(స్వగతము) ఏమనియుత్తరంబొసఁగుదును. (మారాడక యూరకుండును.)

విజ—ఈమౌనమున కర్థములేదు.

మంత్రి—(స్వగ) ఆలోచింపగ నిది యీయామెకృత్యమని తోచుచున్నది.

చిత్ర—కుమారీ! నావలంకులకేల యుత్తరంబీయవు?

భువ—జనకా! చెప్పుటకేమున్నది. మత్కృతపురాకృతపాపమే నన్నిట్టి సభారంగమున కీడ్చినది.

విజ—జనకా! ఇంక నామీను నెన్నివిధముల నడిగినను సమాధానమువచ్చునని తోపదు. తక్కినవారినిగూడ ప్రశ్నింపుడు.

చిత్ర—(వెంకనితో) ఓరీ! నీవెవ్వడవు? ఎందులకు బంధింపబడితివి. నిక్కమెఱిగింపుము.

వెంక—(స్వగతమున) నాపీకమీదకొచ్చేసింది. ఆయాలరేతి రొద్దుపోయే ముండా అంటే పోనాదికాదు. కత్తెట్టికెల్లి అణ్ణిచంపేసి ఆకత్తిల్లా నామీదకూడా యిసిరేసింది. ఏంజెయ్యాను.

చిత్ర—ఏమిరా! నీకు వినబడదా? రాజభటులు నిన్నెందుకు చెఱసాలలో నుంచిరి?

వెంక—నేను బాబూ! నేను చావల్లే మేదరోణ్ణండీ. రేతిరేళ నలుగురు బంట్రోతోళ్లు నాయింట్లోకొచ్చేసి బలంతాని కట్టి లాక్కొచ్చేరండి.

చిత్ర—కుమారా! వీనిమాటలు నమ్మదగినవా?

విజయ—అయ్యా! తపోధనులవలెనున్న తమకుకూడ కారాగృహప్రాప్తి యెట్లు గల్గెనో చెప్పుడు?

జయ—యువరాజచంద్రమా! ఏమున్నది. కర్మవశమున జీవులు తమ పురాకృతపాపఫలమిపు డనుభవించుచుందురు. అట్లే నేనును తమ సోదరిభర్తయైన జయుంతుని వధించియుంటినను నేరముపై బంధింపబడితిని.

చిత్ర—నీవు నిక్కముగా జయంతుని వధించితివా? లేదా?

జయ—ఇందలి నిక్కువ మాపరమేశ్వరునకెఱుక.

చిత్ర—నాడు నేనే వధించి యుంటినని యేలజెప్పియుంటివి?

జయ—ఇపుడుగూడ నట్లే జెప్పుచుంటిని.

విజయు—నీవు సత్యమును వెల్లడింతువా ?

జయ—మించినకార్య మెట్లును జక్కబడనేరదు. కాన యిక నానో టితో యుండలిసత్య మెంతమాత్రమును వచింపఁజాలను. అం దులకు గినిసి తమరెట్టి కఠినశిక్షలకు పాల్పరచినను శిరసా వహింతును.

చిత్ర—అద్భుతముగా నున్నది. కుమారా ! ఇదేమివిపరీతము. నామ నంబూరకే తత్తరమందుచు పరితపించుచున్నది !

విజయు—జనకా ! సావధానులై యుండుడు. ఓరీ ! మేదరీ ? నీవిందలి సత్యమంతయు దెలిపెదవా ? తగినట్లుగ నీచే జెప్పింపవల యునా ?

వెంక—ఇదేంటిబాబూ ! ఏకర్మవెఱగనోణ్ణి నన్ను నంపేత్తారాబాబూ ?

విజయు—ఊరకొనుము. సేవకా ! రెండుపట్టకార్ల నతనికిచ్చి యీ మేదరివానితొడలకు దగిలించి నిజముచెప్పింపుడు ?

[ప్రవేశము యిరువురుభటులు.]

వెంక—బాబో ఛమించాలి. సత్తె పెమాణంగా అంతాసెప్పేత్తాను. రక్షించండి బాబో (స్వగతము) ఇంక నిజముసెప్పకపోతే తప్పదునాగుంది. ఏంజెయ్యాను. మావోళ్ళంతా వద్దంటూంటే యీరాచోరిపిల్లతో చేహంకలిపేసేను. ఇంకనాకు సిచ్చ తప్పదు.

విజయు—ఓరీ ! మూఢుడా ! మాట్లాడవేమి ? భటులారా ! ఊరక చూచుచుంటిరేమి ?

రా-భ—(వెంకని బాధించుటకు యత్నింతురు.)

వెంక—బాబో ! రచ్చించండి. చెప్పేత్తాను. నిజంచెప్పేత్తాను. పెభు వోరికంతా తెలిసిపోనాక నేనాబద్ధమాడ్తేమాత్రం నాభ ముంటుందా ? అంతా నిజం. ఈయెవ్వారంలో నాకూ్కడా

కొంతభాగంవుంది. నేదునేదు. నాకేమీ నేదుగాని నాకత్తిక మాత్రం.

విజయ—ఛీ దౌర్భాగ్యుడా! తిన్నగా జెప్పెదవా? లేదా?

వెంక—పెభువోరు చిత్తగించాలండి. ఈభువనమోయినికి నాకు రెండేళ్ళనుంచి చేహంవుందండి.

చిత్ర—(స్వగతము) అక్కటా! ఎట్టికర్ణకఠోరములగు వాక్యములు వినవలసి వచ్చినది. నిండుసభయందు ఒకనీచుడు తనకును నాకుమారికకును స్నేహముకలదని పలుకుచున్నాడు. ఇంకను యెట్టివిపరీతములగు పల్కులు వినవలసియున్నదోకదా?

విజయ—జరిగినదంతయును త్వరితముగ జెప్పెదవా? లేదా?

వెంక—మూన్నాళ్లకిందట నాదగ్గరకొచ్చి, నామొగుడొచ్చేకని నాతో మోయిని చెప్పిందండి, ఆపళంగా వానిక నువ్వొక్కదుండొద్దు బేగల్లిపో, యెల్లిపోమని బతిమాలేనండి. నామాటంయినక కత్తియ్యి అణ్ణి నంపేసివత్తానని సెప్పింది. వద్దు వద్దు అలాచేస్తే నామీకిమీదికొత్తుందని ఎంతోసెప్పేనండి. నామాటయినక బేగొత్తానని కత్తెట్టికెల్లి మరిం కాయేళరానేదండి.

విజయ—మరల నీకత్తి నీయొద్దకెప్పుడు వచ్చినది?

వెంక—ఈమోయికి మళ్లానిన్నరాత్రి నాయింటికొచ్చి తనమొగుణ్ణి నంపేస్తుండగా నన్నాసోడెవ్వడో అడ్డంవచ్చి నంపద్దొన్నాట్ట. ఆపళంగా తప్పంతా ఆడిమీద దోసేసి వాణ్ణికైదులో పెట్టించినట్టు సెప్పింది. ఆచమయంలోనే నన్ను భటులట్టుకొని ఈకొచ్చినారు.

చిత్ర—(స్వగతము) వినజాల, భరింపజాల.

గీ. తులసివనమున గంజాయి ♦ మొలచినట్లు
వాసిగాంచిన మాదగు ♦ వంశమందు
పుట్టి యుద్దానిని కళంక ♦ పూరితముగ
జేసితివై చనికెట్టులీ ♦ చింతదీరు.

అక్కటా! మచ్చునకేని మచ్చలేని యుచ్చంపుకులంబున కింతింతన రాని కళంక మీామెవలన గల్గినది. ఇంక సాటివారలలో నెట్లు తలయెత్తుకొని దిరుగాడగలను. కుమారీ! చిరుతప్రాయము నుండి యల్లారుముద్దుగ బెంచి పెద్దదానినిగ జేసినచో మాకెన లేని గౌరవంబొనగూర్పగలవని తలంచితినిగాని, యిట్లు తీరని యపఖ్యాతి మాకులంబునకు జేకూర్చెదవని కలనైన దలంప నైతినిగదా?

గీ. సీతసావిత్రి మొదలైన ♦ పూతచరిత
లెట్టి సత్కీర్తిగాంచిరో ♦ యట్టికీర్తి
గాంచగలవని యెంచితి ♦ గాని యిట్టు
లౌననుచు మదిదలపోయ ♦ నైతినకట!

కన్యాదానమున నికేవుతరములును నకేవుతరములును సుస్థిరస్వర్గ లోక సౌఖ్యముల నొందునని భావించి నీజననకాలమున సమ్మోదము వహించితిని. కాని, నాకు, నావంశమువారికిని, యిప్పటికి గాదెప్పటికినై నదీరని యపయశమొనగూర్పగలవని తలంపనైతిని. నినుబెంచుట త్రాచుపామునకు బాలుపోసి పెంచినట్లు నాకే యనర్థదాయక మయ్యెనుగదా? ఆహా! ఎంతసాహసమూనినది. రక్తముజూచిన స్త్రీలు భీతిల్లుదురని పలుకుచుందురే! అట్టియెడ తనచేతులతో తననాథుని జంపినదే! ఎంతసాహసము! ఎంతగుండె నిబ్బరము! ఇట్టివారలీ ముజ్జగంబున నెచ్చటనైన నుందురే.

భువన—(స్వగ) ఈతఁడు జరిగినదంతయు వక్కాణించినాఁడు. ఎట్టి యవస్థ సంభవించినది.

విజయ—భువనమోహినీ ! ఈతఁడు జెప్పినదంతయు నిక్కువమేనా ? ఇతరమేమైన నున్న దెలుపవచ్చును.

భువన—సర్వమెఱింగిన నీకడ వేరుగ వచించుటెందులకు. (స్వగ) ఇంతకంటె జెప్పవలసిన దేమున్నది. చెప్పినను ప్రయోజన మేముండును.

చిత్ర—కుమారా ! ఈనేరమును బాగుగ విమర్శించి నీయిచ్చవచ్చి నట్లు పరిష్కరింపుము. నేనియ్యది వినుచు సహింపలేకుంటిని. (నిష్క్రమించును.)

విజయ—భువనమోహినీ ! నీవు భర్తనురోసి యితరునివరించి ప్రవర్తించినందులకు నిన్నంతగ దండింపవలసినది లేదు. ఐనను భర్తను నిష్కారణముగ వధించిననేరమునకు మరణదండనము విధింపవలయునేగాని దయజూపుటకు వీలులేదు. నీవొనర్చిన నేరము గొప్పదగుటచే నీయందుగల వాత్సల్యమును, ప్రేమను కొంత ప్రక్కకు ద్రోసివైచి యట్టి క్రూరదండనమును విధించుచున్నాను. ఈ నీచరిత్రమువలన ముందు రాఁగలుగువారెల్ల పరపురుషసాంగత్యము ప్రాణహానికి మూలమని గుర్తెఱిఁగి వర్తింతురుగాక.

ఓరీ ! మేదరీ ! ఇందునీకు గూడ భాగమున్నదని వేరుగ వచింపవలయునా ? జయంతుని వధయందు నీవు పాల్గొనకున్నను యామె దుశ్చేష్టకు దోడునూపి కత్తి నొసంగ, వధింపుమని బంపి యుండుటచే నీవును యాతనివధకు ప్రోత్సాహకుఁడవైతివి. కావున యాజన్మపర్యంతము కారాగారశిక్ష ననుభవింపవలయును. భటులారా ! వీనిని గొనిపోయి కారాగారమున బంధింపుఁ

డు. భువనమోహినీ! నాకు నీయందుగలయభిమానము పెంపు న నీకు జననినిజూడవలయునను నభిలాషయున్న యెడలబోయి చూచివచ్చుటకు అవకాశ మొసంగుచున్నాడను. భటులారా! ఈమె యభిప్రాయానుసారముగ మాజననిని జూచుటకు గోరుకొనినయెడల నంతఃపురమునకు గొనిపోయి తదుపరి వధ్యస్థానమునకు గొనిపొండు.

(భటులు వెంకని భువనమోహినిని గొనిపోవుదురు.)

విజయ——(జయపాలునితో) మహానుభావా! నివురుగప్పిన నిప్పువలె యఖండతేజమున నొప్పారు తమరీ ప్రచ్ఛన్న వేషమేల ధరింపవలసినదో దెలుపవేడెదను నిష్కారణముగ తమ్ము చెఱసాలలో మూడుదినము లుంచినందులకు మమ్ము క్షమింపుడు.

జయ——అయ్యా! తమకు నాచరిత్రమును వినిపించినందువలన ప్రయోజనము నుంతైన గాన్పింపదు. పూర్వజన్మ సంచితార్ధప్రతమున గారాగారశిక్ష ననుభవించితినిగాని వేరుగాదు.

విజయ——అయ్యా! నీవిట్లు నీచరిత్రమును మరుగుపరచుచుంటివో తెలియుటలేదు. పోనిమ్ము, నీసాంగత్య మొసంగుచు నాయొసంగు నాతిథ్యమును గొనుచు మాపురంబున గొన్నిదినంబులుండ ప్రార్థింతును.

జయ——వలదు. వలదు. నేను వారణాసి కరుగుచున్నాడను గాన తమకునాపై యనుగ్రహమున్న జయంతుని యస్థికల నాకొసంగుడు. దానినాభాగీరథియందు వైచి కృతార్థుడనయ్యెదను.

విజయ——నీయభిప్రాయానుసారముగనే జరుగవచ్చును. ఈదినమునకైన తమరిచ్చట నుండవలయును. నేటికి సభచాలింతము.

(నిష్క్రమింతురు తెరవ్రాలును.)

ఇది తృతీయాంకము.

# జయంతజయపాలము.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

చెరసాల ముందిఱబయలు.

[ప్రవేశము—ఇరువురు రాజభటులు, వెంకడు.]

వెంక—బతికున్నంతకాలమూ ఖైదులోవుండడంమాట తల్చుకుంటే ప్రాణాలిప్పుడే యెగిరిపోతున్నాయి. ఇంతకంటె సుక్కాన కత్తుచ్చుకొని ఒక్కేటేసి సంపేస్తే కట్టంగుండదుగదా! చీకటికొట్లోపడి, యెలకలు, గబ్బిలాలువచ్చి కొరుక్కొట్టుచున్న చీకటిబందికానాలోపడి, బతికున్న శవాలుగ కట్టపడవలసిందే. తప్పుతుందా? బుట్టలు, సేపలు, గంపలు అల్లుకోవసిన యెదవ మేదరితొత్తుకొడుకు! దానిసుబ్బి సక్కనిసుక్క సిక్కింది గండాయని కులుకుమ అచ్చమైన రాజకులం బుగ్గిలోకలిపేసినే. ఇంక నాకు యిట్టిగాపోతే ఉరిట్టిచ్చు కలుగుతుంది. ఓభువనమోహిని! మోహినో! వద్దే! నాకొంపకు చిచ్చుబెట్టకే! నావీకమీదకొత్తుందే! అని యెన్నోవిధాల సెప్పితే యిన్నావా? ఏపాపంయెఱుగని నన్ను యిలాచేసేసావా! నీవు మాత్రం యేంబావుకున్నావు. సచ్చిపోతున్నావు. చూత్తే నాకిచ్చకంటే నీకిచ్చే మంచిదిగాగుంది. బతికుంటేమాత్రం దుఃఖమేవుంది. పెళ్లామా! పిల్లలా! అయ్యో! పెళ్లామంటే గాపకమొత్తోంది మానత్తికుంట కుర్రోళ్లతో యెలాగేడు

త్రోందో. ఓరే! సత్తే నామీ దాశోదులుకో. గుంటాళ్లని జాగ్రత్తగానూచి పెంచుకో. ముష్టానష్టా యెత్తుకోగాని యెదవ పోకిళ్లకుపోయేవా! నాలాగేనువ్వూ దక్కులేకసత్తావు.

రాజభటు—ఓరీ! నీసోదికేమికాని ముందు త్వరగా నడువుము. నిన్ను బంధికానాలోపెట్టి మాయిండ్లకు పోవలయును.

(అని గెంటుచు నిష్క్రమింతురు.)

[ప్రవేశము—భువనమోహిని—రాజభటులు.]

భువనమో—తుదకు నాయవస్థ యిట్లరుదెంచినది. కన్నతల్లినైన గాంచివత్తునని పోయితినిగాని, అచ్చటికేగగనే ఛీ! యేమొగము పెట్టుకొని యామెను జూతునని ముందున కడుగిడజాలక పోతిని. యౌవ్వనమదమున యుక్తాయుక్తము లాలోచింపక ముందువెనుక లరయక, పాపభీతిలేక, యువపతినై యాసించితిని. అంతలోనూరకొనిన లోకముతో పాటియగునేమోగాని మానంబోగమునకు నాధుడడ్డమువచ్చునేమోయని భావించి యీతని సాంగత్యమే శాశ్వతఫలదాయకంబని చింతించి, పాపభీతిలేక, జంకులేక, కన్నులార నాధునివధించితిని. మహోన్నత మహాకార్యమునకు దగినశిక్ష ననుభవింపుచుంటిని. లోకమునందరకు గురినైతిని. తెలిసిన స్త్రీలకు నపకీర్తి దెచ్చితిని. అంతకంటె నాజననమువలన నాకుగాని, లోకమునకుగాని యుపయోగము జేకూర్చజాలనైతిని. ఎట్టిసుఖమున కాసించి యిట్టి యకార్యమున కొడిగట్టితినో యాసుఖమైన ననుభవింపజాలనైతిని. ఇక నాచరిత్రనాధారముగాగొని పెక్కురు పెక్కువిధములుగా గ్రంధములరచించి నా నామము, భూమిపై నిలబెట్టుచు భాషజనులకు చక్కని ప్రబోధము చేయుదురు. ఇంతకంటె నాజన్మమువలనలాభమున్నట్లుగాన్పింపదు. జననీజనకులారా!

పావనులైన తమ గర్భవాసమున నిట్టికులట జన్మింపలేదనియే భావింపుము. నను మరచిపొంము.

రాజ—భువనమోహినీ! తడయుటకు వీలులేదు. సత్వరముగా నడుపుము. (భువనసుందరితో భటులు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

---

## ద్వితీయరంగము.

ఒక గ్రామమునకు కించుకదూరముననున్న బయలు.

[ప్రవేశము సన్యాసివేషమున జయపాలుడు.]

జయ—పరమేశ్వరా! జగంబుల కంటియునంటని చందంబున మెలంగుచు జగన్నాటక సూత్రధారుడవై సచరాచరభూతంబులచే నీవిలాసనాటకంబున నాడించుచుంటివి. మాజీవితచరిత్రనాటకమున కాయాటవెలదిచే నాందీశ్లోకమును పఠింపజేసి, మాకు మైత్రికి భంగముగల్గించితివి. తదుపరి యొకింత శృంగారమును చవిజూపి మాజయంతునిపాత్ర కాతనిభార్యచే స్వస్తి జెప్పించితివి. పిమ్మట నన్ను చెరసాల ద్రోయించితివి. ఉరికంబ మెక్కింపదలచియు, కరుణాలేశమున నన్ను గాపాడి-యీవిధంబున శ్రమజెందుచు పరితపించుచుండుమని నియోగించితివి. ఇంక నెట్లాడింపనున్నాడవోగదా? ఎవ్వని ఋణమైన నిడువకుండవలయుననితలంచి, చూచుటకసహ్యకరమైన యీవేషమును ధరించితినో యూగనితో యెడబాటుగల్గెను. ఇంక నాతనిగనుటకుకూడ నోచనైతిని. తల్లిదండ్రులకా తీరనిచింత కూర్చితిని. అక్కటా! వారు నాకొఱకెట్లు విలపించుచున్నారోగదా!

గీ. పంక్తికోశనాడురాకున్న ♦ పరితపించు;
జనకుడెట్లు భావించెనో ♦ జనని యెట్టి
వంతఁజెందుచునుండెనో ♦ నుంతయైన
మందబుద్ధిచే తలపోయ ♦ మరచినాఁడ.

పోయి సత్వరముగ వారినిదర్శించి క్షమింపుడని వేడుకొనియెదగాక. వలదు వలదు. అచటికేగిన భూపాలుడు "మాకుమారుడెక్కడ" యని ప్రశ్నింప నాతనికేమని యుత్తరంబొసంగఁగలను! జన్మభూమికిని నాకును చాలదూరమయ్యెను. జననీజనకులారా! ప్రాణములకంటె ప్రియతముడగు మిత్రునిపోఁగొట్టుకొని, తమసన్నిధికిరాఁజాలను. ఇక నన్ను మరచి పొండు. జయంతా! జయంతా!! మనమిరువురమును క్షణమైనవిడువక, భార్యలను దీసికొనివచ్చుటకైన పోవక, నింతవఱకు గడపితిమే. అట్టియెడ, నీవునన్ను విడచి యెట్టులాస్వర్గమున నుండగలిగితివి! నేనెట్టులుండగలనని భావించితివి? ననుగూడ నీకోఁగొనిపోయిన అచ్చటనైన సుఖముగ కాలముగడపుచుండుముగదా! జయంతా! ఆకులట, నీ కుత్తుకను త్రెంచ మనపుడెంతెకా దురపిల్లితివోగదా! నీకుసమీపమున నుండియు నినురక్షింపఁజాలనైతినిగదా! ఏటికిక నీజన్మము. దుశ్చారిణీ! భువనమోహినీ! యెట్టికట్టనివై కట్టతనంబున నిట్టియకృత్యమొనర్చితివి. ...ఆమెను దిట్టుకెలంగులకు. కట్టుకొన్న భార్యను పుట్టింటనింత కాలము వఱకు దిగవిడచినందులకు మాజయంతునే యనవలయును... జయపాలా! నీతప్పునెఱుంగక, నీహితునితప్పిదములనెంచుచున్నావా? నీవు మాత్రమేమిచేసితివి? నీభార్యనుమాత్రము పుట్టింటదిగవిడచి యుండలేదా... అగును. ఆమె నన్నెట్లు గారవించునో గమనించవలయును. కఠినేమిత్తునో, పినప్రయోగమేచేయునో, ఇతరులనందులకు ప్రోత్సహించునో కనుగొనవలసినదే, సత్వరముగ నేగి యామెశీలమును గూడ పరీక్షింపవలసినదే... నేటికే సమీపగ్రామమునకేగి, యందు

విశ్రమించి రేపటిదినంబునఁ గుంతినగరమునకు ప్రయాణమయ్యెదను. ఆమెయు భువనమోహినితో సమానురాలయ్యెనేని, యామెకు జక్కఁగ బుద్ధిచెప్పి యిప్పటి యీ వేషమునే నిక్కముగ ధరించువాడనై వారణాసికరిగెదగాక. ఆమె సాధ్వియగునేని పరిగ్రహింపదగును. అదే సూర్యభగవానుఁ డస్తమింపబోవుచున్నాఁడు. ప్రయాణముసాగించి చీకటిపడకుండ సమీపగ్రామమును చేరుకొనవలెను. లేకున్నచో, యెరుగని గ్రామమున కెట్లుపోవలయునో, తెలియుటకవకాశముండదు.

(నిష్క్రమించును.)

## తృతీయరంగము.

### అంతఃపురము.

[ప్రవేశము—చారుమతి.]

చారుమతి—(ఖిన్నయై.)

సీ. చెలిమికత్తెలపోల్కి ♦ జీవేశుజేరక
పరితాపమొందుటే ♦ పాపఫలమొ
ఏసౌఖ్యమెఱుఁగక ♦ యీలీలగుందుచు
పరితాపమొందుటే ♦ పాపఫలమొ
విభునితోహాయిగా ♦ విహరింపనోచక
పరితాపమొందుటే ♦ పాపఫలమొ
మదనాగ్నిజ్వాలల ♦ మధ్యంబుననుజిక్కి
పరితాపమొందుటే ♦ పాపఫలమొ
లేకయున్నను నొక్కటే ♦ గాకనిట్లు
కలిగియును సౌఖ్యమిసుమంత ♦ గాంచలేక
పరిపరివిధంబులనుగుంద ♦ వలసివచ్చె
పూర్వకృతములు విడనాడి ♦ పోవునొక్కొ.

పరిణయమై మూడుసంవత్సరములైనది. నాటిమొదలు నేటివరకు ప్రాణేశ్వరుని సందర్శనభాగ్యము లభింపదయ్యెను. ఆవివాహమునాడైనను, చెలులు పరిహాసింతురేమోయని యామహాభాగుని ముఖారవిందమును దిన్నగనైన గనజాలనైతిని. అక్కటా! ఎంతకాలమిట్లే కన్నవారింటకాలముగడపుదును. ఇంకెన్నటికేని, నాకు నాజీవితేశ్వరునితోగూడు భాగ్యములబ్బునా? లేకున్న నా యీజన్మ మడవినిగాచినవెన్నెల చందమున, చవిటిపఱ్ఱలో వర్షించినగతి, వ్యర్థము గావలసినదేగదా! ప్రాణేశ్వరా! తమకేల నాపై కరుణగాదు. తమ పాదపద్మసేవ లభించుటెన్నడో యని దినమొకవత్సరముగా గడుపుచు, జీవచ్ఛవంబనై పరితపించుచుంటినిగదా! ఇంకనైనను తమకుదయరాదా! తమకుతీరిక లేకున్న నెవ్వచేనైన వర్తమానమంపినను నాజనకుడు నన్ను తమ చెంతకు దోడ్కొనివచ్చుటకు సంసిద్ధుడై యుండెనే. అట్లేల చేయరైరి. నాథా! నాథా!! "నిక్కముగా నను పరిగ్రహింపు తలంపులేకనే యుపేక్ష చేసి యుంటిరా! కట్టా! అట్లైన జీవితము దుర్భరము. పతికిదూరగానై, తలిదండ్రులకు భారమై, లోకుల నిందలకు బాత్రమై యీభూవలయంబున నిలువజాలను...ఏమిచేయుదును. నాప్రభునకు నాపై నెట్లను రాగము గల్గును. యుక్తవయస్కురాలైన పిల్లను పుట్టింటదిగవిడచుట భావ్యముకాదని జనకుడెన్నిపర్యాయములో వార్తబంపెను. లేనిపోనీ సిగ్గిడుకొనిపోయి తానుగూడవారితో కోడలిని దోడ్కొనివచ్చుటకై రావలసినదని ప్రార్థించెను. ఇంతకంటెనాతండేమిచేయగలడు. ఎన్నిచేసినను, నానాథునకుగాని, పూజ్యులైన మామగారికిగాని నాపై దయకలుగదయ్యెను. ఆలోచింపగ యింక నాకీజన్మమున నాథుని సందర్శించు భాగ్యము లభించదనియే తోచుచున్నది. పరమేశ్వరీ! నీభక్తురాలనైయున్న నాపై నీకుగూడ దయ గాదయ్యెనా?

నను రక్షించుటభారమా కాళీ! జగన్మాతా! అనుగ్రహముంచి నా వాంఛితమీడేర్పుము......(ప్రార్థనాపరవశయై యుండును.)

(ప్రవేశము—నర్మద.)

నర్మద—ఈమెకొఱకు వెతకి వెతకి వేసారితిని. ఇదిగో యిక్కడ గూర్చుండి యేదో యాలోచించుకొనుచున్నది.

చారుమతి—నాథా! నాథా!! మండువేసవియందు సిందుదాహమున నీరదాగమమాపేక్షతో నెదురుచూచెడుచాతకి చందమున నిను దర్శనమపేక్షించుచుంటిని...అనుగ్రహముంచి దర్శనమొసంగుడు.

నర్మద—చెలీ! చారుమతీ! సంగతియిదే యింతయా! ఏమి నీ భ్రాంతి యంతకంతకధికమగుచున్నది. చాలుచాలు. ఒంటరిగ గూర్చుండి నీవు చేయుపని నేటికి దెలిసినది.

చారుమ—నర్మదా! ఎంతసేపైనదే నీవరుదెంచి?

నర్మ—ఒకముహూర్తకాలమైయుండును. కాని, సకలైశ్వర్యములతో తులదూగుచున్న పుట్టింటనుండినను విచారమా!

చారు—నర్మదా! ఎంత భ్రాంతిపడుచుంటివి. సతులకీసౌఖ్యములకంటె వాంఛనీయమింకొకటి లేనేలేదా? పతిపాదసేవలేని యీ సౌఖ్యములేల, యీభోగములేల. పతితో నారగించిన గంజి యైనను యమృతోపమానమగును. పతితో నేకశయ్యగలకాంతకు కరకురాలైనను హంసతూలికాపాన్పులగును. వేయేల, పతితోననుభవించు మహాదారిద్ర్యమే యానందదాయకమగును. పతియేలేకున్న సతికేమున్నను నన్నియులేనివై యుండును. సంసారసాగరమునుండితరించునట్లుగ చుక్కానుద్రిప్పుచు యోడ నడపునాయకుడే నాథుడు. సౌఖ్యవారాసితరంగడోలికలపై

నతిమనోహరి హాయినూపుచతురుఁడే జీవితేశ్వరుఁడు. వేయేల సతికి పతియే యేకగతియనుట యెఱుంగవే.

సీ. పడతికి ముంగొంగు ♦ బంగారునాథుండు
కోర్కెలొసంగుగొప్పు ♦ కూర్మిధవుఁడు
కివలయోషికినితఁ ♦ గెటిజున్నదయితుండు
అదనునకొదవు ద్ర ♦ వ్యంబుహితుఁడు
ప్రాణంబునకు సుధా ♦ పూరంబు చెలికాఁడు
తరుగని మేరువు ♦ తలపవిభుఁడు
ఆకటికొదవిన ♦ యన్నంబు కాంతుఁడు
యిలవేల్పుపతికి జీ ♦ వేశ్వరుండు
వారిజాక్షికిసకల సౌ ♦ భాగ్యవిభవ
వల్లికొనపట్టుకొమ్మయా ♦ వల్లభుండు
పెక్కుమాటలికేలను ♦ నెంచియరయ
యేకగడయైనవాఁడు జీ ♦ వేశ్వరుండు.

నర్మదా! పతిపాదరాజీవసేవయే సంసారసాగరమును దరించుటకు దగిననావ. మోక్షసామ్రాజ్యమును బొందుటకును వైనమార్గమే ప్రాణేశ్వరారాధనము. సతులకుతీర్థములు, వ్రతములున్నుగువాంఛింతు సవశ్యాచరణీయము పతిసేవ. కాన, నర్మదా! అట్టిపతికినాపై నెనరులేకపోయెను. నాకట్టిసుహృద్భాగ్యము లభింపదయ్యెను. ఇంకేటికీజవ్వనము. ఇంకేటికీజన్మము. నాకున్న సకలైశ్వర్యములు నాకొఱతదీర్పగలవా! ఈవనములు, యీసౌధములు, యీచీనాంబరములు నాకెందులకు?

నర్మ—చారుమతీ! నీవుచెప్పినవన్నియు నిక్కములనుటకెట్టిసందియమునులేదు. కాని నీయాపదలు శాశ్వతములా! ఎప్పటికిని కాలమొక్కరీతిగనేయుండునా? నేడుబిచ్చగాడుగనున్న వాఁ

డు రేపుధనికుఁడుగావచ్చును. నేడుధనికుఁడైన వాఁడు రేపుబిచ్చగాఁడగును. కొన్ని దినములు చీఁకటిరాత్రులును, కొన్ని వెన్నెలరాత్రులును లేవా? అట్లే కష్టసుఖములు వచ్చుచుఁ బోవుచుండును. అందులకై చింతించుచుండుట తగునా?

చారు—నర్మదా! కష్టసుఖములు సహజముగా నోర్పుమై ననుభవింపవలసినదే. కాని నాయీకష్టము తీరునట్లు దోఁపదు. అట్టియువకాళమేయున్న నాకాంతునకీవరకే నాపై ననుగ్రహము గల్గియుండును. నేనాతనిపవిత్రనామమే పంచాక్షరీమహామంత్రంబు వోలె పఠించుచు దినములెట్లో గడపుచుండ నామహాభాగునకు నేనిచట నుంటిననుమాటయే జ్ఞప్తికి రాకపోయెనే. ఇఁక నాపై ననుగ్రహము జనించుటెట్లు? నర్మదా! పెక్కుపలుకులేల? ఇఁక నాకీజన్మమున యాతనిసాంగత్యంబు లభింపదు. ఏమందువా? కొన్నిదినంబులిట్లే గడచి చనిన నామేన ప్రాణములునిలువవు. ఆపిమ్మట యాతనికి నాపై ననురాగము జనించిననేమి? జనింపకున్ననేమి?

నర్మ—అశ్లీలము లాడెదవేమి? మరల నీజనకుఁడు విజయదత్తవారికి వర్తమానముబంపి యున్నాఁడుగదా!

చారు—ఇదివరకెన్నిపర్యాయములు వర్తమాన మంపియుండలేదు. అతఁడుకూడ పోయివచ్చెనే. అపుడేమయ్యెను. అపుడు చేకూరని మేలు నేఁడు వార్తబంపిన మాత్రమగునా?

నర్మ—అటుకాదు. ఇపుడు వారిచిత్తవృత్తి యెట్లున్నదో దెలియ నగునుగదా

చారు—కానిమ్ము. ఆవర్తమానముయొక్క ఫలితముగూడ నేఁడో రేపో దెలియఁగలదుగదా! అపుడు నాపలుకులు నిక్కములే యని భావింతువు గాక.

నర్మ—చారుమతీ ! నీవెన్ని జెప్పినను సరిదోఁగాని యిట్లుండుట యేమియు బాగుగా లేదు. తలదువ్వుకొనక, మాసినకట్టుపుట్టము నైన విడువక, దేహారోగ్యమైన జూచుకొనకుంటివి.

చారు—నర్మదా ! నన్నుగని యానందించువారు లేనపుడు నేనెట్లున్ననేమి ? దేహారోగ్యవిషయమైన శ్రద్ధ దీసికొనవలదా యంటివి. ఎందులకీ శరీరము. ఎందులకిద్దాని సంరక్షణ. ఏశరీరమువలన లోకమునకుగాని లోకము వలన ఆశరీరమునకుగాని యుపయోగము లేకుండునో యాశరీరమున్ననేమి గతించిననేమి. మరియొకవిషయముగూడ నీవు దెలిసికొనవలయును. ఆరోగ్యవిధుల బరికింప నంతమాత్రమున చనిపోవుదురా ? ఆయుష్కాలముదీరిన నారోగ్యవిధు లాశరీరము జీవయుతమైయుండునట్లొనరింపగలవా ? నర్మదా ! ఎంతభ్రాంతి పడుచుంటివి. మనశాస్త్రములుకూడ నిట్లే బోధించుచున్నవనుట నీవాలింపవా ?

సీ. పతిచెంత లేకున్న ♦ భానురాంగికురుల
నింపుమీరగ సంస్క ♦ రింపరాదు
పతిచెంత లేనిచో ♦ సతిచందనాదుల
మేనిపై నలఁదుట ♦ మేలు కాదు
పతిచెంత లేకున్న ♦ సతిమంచిపుష్పముల్
కొప్పులోనను పెట్టు ♦ కొనగరాదు
పతిచెంత లేనిచో ♦ సతిభూషణంబుల
సొంపుగా మేన ధ ♦ రింపరాదు
భర్త తనచెంత లేకున్న ♦ పడతి కొవుకు
పరిగ చీరెలధరియింప ♦ జనదు వక్క

లోకులనుగాని విడనుమనీ • యనంగరాదు
పరుషభాషణములనైన పలుకరాదు.

నర్మదా ! బాగుగా బోధకమైనదా ?

నర్మ—చారుమతీ ! నీవిట్లు కుందుచుంటివిగాని లోకమంతయు నిట్లుండునా ? పలుగురితోబాటుగ సంతోషములేకున్నను నింతసంతోషము జెందియుండగూడదా ?

చారు—లోకమెట్లున్ననేమి ? మన విధ్యుక్తములు నశించుటకు లోకమడ్డువచ్చునా ? నర్మదా ! పైకొకరీతిగను, ఆత్మయందొకవిధముగను చరించుటవలన నెక్కుడు హానికల్గుచుండును.

నర్మ—నీవు నిర్భయురాలై యింతగ కుందుచుంటివిగదా ! అతడు నిన్నొకపరియైన దలంపడాయెను. అట్టివానికొరకై నీవు నిత్యమును విచారించుటేల ?

చారు—నర్మదా ! అతడు నన్ను స్మరించినను విస్మరించినను నాతని పాదపద్మములు పూజింపనెంచుటే నాయవశ్యకర్తవ్యము. అతడెట్టివాడైనను కానిమ్ము. అతడు నాపతియేగదా !

నర్మ—చెలీ ! చారుమతీ ! నీతోవాదము మిక్కిలికష్టము. కాని, నేటి ప్రసంగమువలన పతిధర్మములు పెక్కిటిని నేర్చికొంటినని సంతసించుచున్నాను. నేనరుదెంచి చాలతడవైనది. నిను దోడ్కొనిరావలసినదని మీజననీ ననుబంపెను.

చారు—ఎందులకో నీకు దెలియునా ?

నర్మద—తెలియదు. కాని, ఆమె నీవింకను నిద్దురనుండి మేల్కొని యుండవని తలంచినట్లున్నది.

చారు—అవును. దినదినమునను యీ నాశయ్యాగృహమునందే యేదో విచారించుచు గూర్చుందును. అందువలన నామె చెంతకు బోవునంతకు వేళమీరుచుండెడిది.

నర్మ—అనగా సూర్యోదయమునకు మున్నే నిదురమేల్కాంతువా !

చారు—నర్మదా ! నాకు నిద్దురయెక్కడిది. మరంతచింతాక్రాంతనై రేయెల్ల నాటంకపరచువారు లేకుండ విచారించుచుందును. పతివియోగదుఃఖితనగు నాకు నిద్దురకూడనా ?

నర్మ—అక్కటా ! ఎట్టికష్టము లొందుచుంటివి ? అందువలననేకాబోలు నీశరీరము నానాటికి కృశించుచున్నది.

చారు—కృషించిన దేహమేదో యీవరకే కృషించినది. ఇంక నశించుటమాత్రమే కొరవడియున్నది.

నర్మ—ఆశలను నిరాశనొందెదవు. నిత్యమునుజూచు మేము నీ యందలిమార్పు గనజాలము గాని, ఒకమాసమునకు పూర్వము నిను జూచినవారుమాత్రము తప్పక నీవు చిక్కినట్లు పోల్ప గలరు.

చారు—పోవమ్మా ! ఎట్లో యీామేన జీవముల నొక్కయాసతో భరించియుంటిని. ఆయాశయు నిరాశయైన యుత్తరక్షణముననే జీవము లీకట్టెను విడచిపోవును.

నర్మ—ఆశ్లీలము లాడకుము. త్వరలో నీవు సుఖింపగలవు. అపుడు నీభర్త నినుజూచి యిదేమి యింతగా కృశించితివని పరిహాసించును లెమ్మా.

చారు—అంతటి మహద్భాగ్యమే లభించినపుడేదో ప్రత్యుత్తర మొసంగెదను లెమ్మా.

నర్మ—చెలీ ! జనని నీకొర కెదురుచూచుచుండును. రమ్మా పోవుదము.

(నిష్క్రమింతురు.)

## చతుర్థరంగము.

### చారుమతి సౌధము.

[ప్రవేశము—చారుమతి.]

చారు—అర్ధరాత్రము మీఱవచ్చినది. ఎల్లరును నిద్రాదేవికౌఁగిలిలో జేరి హాయిగ సుఖించుచుండిరి. కాని నాకట్టిసుఖము కలుగ దయ్యెనుగదా! నిద్రకును నాకును చాలదూరము గలదు. సంతోషపరవశులైన వారలనే నిద్ర యూవహించునుగాని, నాయట్టి దుఃఖితలను గాంచి దూరమేగుచుండునని యేతోచు చున్నది. కానిమ్ము, నాడా భగవతి జెప్పినగడవు మూఁడుదినం బులలో ముగియనున్నది. ఈమూఁడుదినంబులలో నామనో హరసందర్శనము లభింపకున్న యాత్మహత్య కొడిగట్టి యీ నా పాత్రమునకు స్వస్తిజెప్పెదను. ఎట్లో ఈమూఁడుదినంబు లును గడపుటకు యత్నించెదను. కాళికాలయంబున కరిగి యా జగన్మాత నారాధించి వచ్చుటకు సమయమైనది. (శయ్యపై నుండిలేచి బల్లపై నున్న పూజాద్రవ్యముల పళ్లెరముగొని తలుపుతెరచుకొని వెలికరుదెంచును.)

తెర వ్రాలును.

చారు—ఈ నిశీథమున కాళికాలయమున కరుగుట తప్పిదమేయని కొందఱెంచిన నెంతురుగాక. నిర్జనమై నిర్మలమై యున్న సమయముననే పూజజేసిన జగన్మాత మెచ్చునని నాయభిప్రాయము. (నడచుచు) అయినను యేదుష్కృతుఁడైన నెదుటకరుదెంచి యడ్డగించునేమోయని యొక్కొకసమయమున భీతిజనించుచుండునుగాని, సత్కార్యాచరణమునకై నిశ్చలబుద్ధితో పోవుచున్న నాకట్టి యాటంక మెప్పుడును గలుగలేదు.

(నిష్క్రమించును.)

తెరలేచును.

కాళికాలయము.

[ప్రవేశము—చారుమతి]

చారుమతి—(పూజయొనరించి.)

దండకము.

శ్రీమన్మహాదేవి దాక్షాయణీ సర్వలోకైకరక్షామణీ దుష్టసంహారిణీ! పాపసందోహ సంహారిణీ! వారిజాతాననుండాదిగాగల్గు గీర్వాణసంఘంబు లెల్లన్ భవత్పాదపంకేరుహధ్యాన పారీణులై సర్వసౌఖ్యంబులన్ బొంది యున్నారు. నీభవ్యకారుణ్యమున్ బొందుచో మోక్షసామ్రాజ్యమింపొందజేకూరదే. మూఢురాలన్ కృపాదృష్టి వీక్షించి రక్షింపుమా తల్లి! నీవే శరణ్యంబు నీపాదపద్మంబులే ప్రాపుగానెంచి పూజించుచున్నట్టి దాసన్ దయన్ జూడుమో యమ్మ! సంసారసౌఖ్యంబు సుంతేని యున్ లేక పారంబులేనట్టి దుఃఖాబ్ధిలో మున్గి నిత్యంబు సంతాపమున్ బొందుచుంటిన్ మనోనాథు సాంగత్యలాభంబు జేకూర్చి నన్ బ్రోవుమా దీనురాలన్ జగత్కల్పవల్లీ నమస్తే నమస్తే నమః.

తల్లీ! ఈదీనురాలియెడ నీకిప్పటికేని దయరాకపోయెనా? నాజన్మము డవిని గాచినవెన్నెల చందమున నిష్ప్రయోజనము కావలసినదేనా? నాయాశాంకురము లన్నియు నడుగంటవలసినవేనా? ...నీదాసానుదాసురాలనై నిర్మలమైన భక్తిని సేవించుచుండుటలేదా! నీభక్తురాలియెడ నీకింతయనాదరణ మేలగల్గెను. పోనిమ్ము. నాయభీష్ట మీడేర్చకున్న మానె. నాజీవితములనైనకొని సంతసించి పరలోకమునన్నైన నానాథునితో సౌఖ్యమునొసంగు మంతియే చాలును. ఇంక మూడుదినములుమాత్ర

మే యీతనువున జీవములుంతును. అటుపిమ్మట యెట్లు జరుగునో పరమేశ్వరివైన నీవె యెఱుంగగలవు. తల్లీ! కడపటి కోరికను దెలుపుచుంటిని. నేటినుండి మూడుదినములలోపున నాజీవితేశ్వరు సందర్శన భాగ్యమొసంగు మదియే చాలును. ఏనాడు నాయభీష్టము నెరవేర్చిన నాదినంబుననే నాకంఠరక్తముతో భవచ్చరణ కమలముల కభిషేక మాచరింతును. ఇందులకు దప్పిన తల్లిదండ్రులకు దప్పినదాననగుదును. జగన్మాతా! ఇకనాకు పోయివచ్చుట కనుజ్ఞయిమ్ము.

(నిష్క్రమించ తెర వ్రాలును.)

ఇది చతుర్థాంకము.



# జయంతజయపాలము.

## పంచమాంకము.

### ప్రథమరంగము.

చారుమతి సౌధము.

[చక్కగ నలంకరింపబడిన శయనాగారమున జయపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

జయ:— నేటితో నీజయపాలుని యేమనసమస్య పరిష్కరింపబడును గాబోలు. పరికింపగా, సతులను బుట్టినింట నింతకాలము వరకు దిగవిడుచుట నిక్కముగా బుద్ధిలోపమని యిప్పుడు తోచుచున్నది. ఎట్టివాడైన భార్యను పుట్టినింట బెద్దకాల ముంచరాదు.

గీ. వసుధ పాలించువాడైన • బడుగుబాప
డైన నీచసేవకుడైన • నాత్మలోన
తనదుసతి సాధ్వియగుటకు • దలుచునేని
పెద్దకాలంబు పుట్టింట • విడువరాదు.

బడలియుండుటచే గాబోలును నిద్దురవచ్చుచున్నది. కాని యీ దినమున నిద్ర నెట్లైన జయింపవలయును. లేకున్న మాజయంతునకు బట్టిన గతియే సంభవించునేమో! ఏమో యింకను చెలి రాకున్నయది. (ముందునకు జూచి) అదే ఆలతాంగి జనుదెంచుచున్నది.

గీ. ఆశముందడుగేయ ల • జ్జాతిరేక
భరము వెన్కకడుగిడున • ప్పడతిమిన్న

చెలిమికత్తెలచూటున • సిగ్గుపడుచు
సుందరయానయై వచ్చెన • సుందలీల.

ప్రవేశము—నర్మద, చారుమతి, సుశీల.

సుశీల—అమ్మా! చారుమతీ! ఎవ్వనికొరకు రేయింబవళ్లు నిద్రాహారంబుల మాని పరితపించుచుంటివో యామహాభాగుడే నిన్ననుగ్రహింప నిట్లరుదెంచియుండెను. ఇంకను సిగ్గుపడెద వెందులకు?

నర్మ—(అపవారించి) చారుమతీ! నాపలుకులు నిశ్చయములయ్యెను గదా! నీవిభుఁడు నిన్నింతగా కృశించినందులకుగల కారణ మడిగిన నేమందువో చెప్పుము?

చారు—(సిగ్గున నూరకుండును.)

నర్మ—సుశీలా! ఈమెతో నింక మనకేల. వైష్ణవునితో స్నేహము వంటయింటివరకే. పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

జయ—(తనలో) త్వరితముగ నీమె కవకాశమొసంగి తదుపరి యీమె యేమిచేయునో కనుగొనవలయునుగదా!

చారు—(తనలో) ముందుగ నేను మాటలాడినచో యామహాభాగునకు నాపై ననుగ్రహము జనించునేమో! (సమీపించి పాదములపై వ్రాలి) నాథా! (మాటలాడ నేరకుండును.)

జయ—(తనలో) ఇట్టిది యనురాగలక్షణమా? నను మాయజేయుటకు బన్నిన మార్గమైయుండునా? ఏమైననేమి; ఇప్పుడీమెను యెట్లో సంతసింపజేసి నిద్దురవచ్చుచున్నట్లు నటించి తదుపరి జరుగగల చిత్రమును విలోకించెదగాక. (ప్రకాశముగా) ప్రియా! ఇదేమి. విచారించుచుంటివా! లెమ్ము. (లేవదీయును.) ఆదినములు గతించినవి. ఇంక సకలసంతోషముల గల్గి సదావర్తింతము. (కన్నీరు తుడుచుచు) నీమీద నీవరకు

నపరాధ మొనరించియుంటిని. అందులకై క్షమాపణగోర వలసినవాడను నేను. ఇట్లేల బేలవయ్యెదవు.

చారు—నాథా! నాథా!! తమ్ము క్షమింపగలదాననా! నాపూర్వ జన్మసుకృత మిట్లుండుటవలననే తమకు ననుగ్రహము రాదయ్యెను. ఇప్పటికైన నా పరమేశ్వరు డనుగ్రహించి తమ పాదపద్మసందర్శనము నాకనుగ్రహించియుండెను. ఇందులకే నేనధికముగా సంతసించుచుంటిని. ఇట్టి మహాద్భాగ్య మెన్నటికేని లభించునాయని, పుట్టినదిన మెప్పటికేని నాజన్మ మధ్యమున గల్గునాయని నిరంతరము చింతించుచుంటిని. ఆదినము సంప్రాప్తమయ్యెను. నామనోవ్యథ యడగినది. నా దుఃఖ మువశమించినది. అన్నివిధముల నాజన్మతరించినది. కాని తాము క్షమాపణగోరనుంటినని పలికితిరి. అట్లనుట భావ్యమా! తమ పాదదాసినిగదా!

జయ—(స్వగ) అతివినయం ధూర్తలక్షణమందు రిట్టిదేకావలయును. ఇందు సత్యమెంతయున్నదో. (ప్రకాశ) ప్రియా! గతమును విస్మరింపుము. ఇంక నిన్నిచట విడువను. నిను నావెంట గొని పోయెదను.

చారు—అవశ్యమట్లే దోడ్కొనిపొండు. తమ పాదదాసి కంతకంటె వాంఛనీయముండునా?

జయ—(స్వగ) పలుకుల నెట్టిమాలిన్యమును గాన్పింపదు. హృదయగతి మెఱుంగ నెంతటివారికిని యసాధ్యము. అందునను స్త్రీల హృదయము లగాధములు. స్త్రీహృదయము దెలిసికొనినవాడు సర్వవిద్యావిశారదుండనుటకు జాలినవాండు. (ప్రకాశముగ) ప్రియా! (చేయిపట్టుకొని) నిను విడచి నేనుమాత్ర మచట సుఖముగ నుంటిననుకొంటివా! అవకాశము లభించినప్పుడెల్ల

నేట రేఁపట బయలుదేరి యిచ్చటికి బయలుదేరదలంచుచు మరల నేదో కార్యవ్యాసంగమునబడి యది మరచుచుందును. ఇట్లే మెల్లన మూఁడువత్సరములు గతించెను.

చారు—నాథా! ఇచ్చోటనే ననుగూర్చి నిలువఁబడియుంటిరి. ఈవరకు తాము ప్రయాణమునచే యధికముగా బడలియుందురు.

జయ—అగును. రమ్మీయాసనముపై గూర్చుండుము. (ఆసీనులగుదురు.)

చారు—(చేతనున్న పళ్లెరమునగల తాంబూలమును నాథున కందించును.)

జయ—(స్వగతమున) వలదు. ఈవిడెముగాని యీభక్ష్యములుగాని రుచిచూడవలదు. జయపాలా! చెడెదవుసుమా! (ప్రకాశ.) తరుణీమణీ! మిక్కిలిగా బడలియుండుటచే నిద్దురమైకము గలుగుచున్నది. ఇంక నీతాంబూల మెందులకు.

చారు—(వీవనగైకొని విసరుచుండును.) పోనిండు. ఈ ఫలహారములనైన చవిజూడుడు.

జయ—ప్రియా! నీవు వట్టివేఁపుసుమీ. ఇంతను భోజనమాచరించి రెండుఘడియలైనకాలేదు. తిరుగఫలహారమా? నీయట్టి కాంతామణి లభింపనిక నీఫలహారము లెందులకు.

చారు—(సిగ్గుపడి యించుక యూరకుండి) నాథా! తమదాసివలన నెట్టి సపర్యయు గైకొనరా! నేటికి దమసేవ లభించినదని సంతసించుచుంటినే.

ఉ. చల్లనిపిల్లతెమ్మెరల ♦ చామరముంగొని వీతునో్కో మీ
యుల్లముఁబల్లవింప పద ♦ యుగ్మము నాతొడపై ననిల్పి నే
మెల్లన బట్టగావలెనొ ♦ మేని శ్రమంబెడబాయునట్లుగా
వెలకిఁగొంచు హాయిగను ♦ పాడెదుదాననొ యోసతీయు గే!

జయపాలు—(స్వగ) ఈవిధంబుగ గొంతతడవు వేగించినయెడల త్వరలో మేల్కొనజాలని నిద్దుర బట్టునని యీమె యభిప్రాయమైయుండునేమో. (ప్రకాశముగా) ప్రాణప్రియా ! నీమాటలునాకు వింతగనున్నవి. నీవెట్లు దాసివికాగలవు. నాశరీరమున నర్ధమును నీకుధారవోసి యుండలేదా ! భార్యను దాసిగా దలంచుట కేవల బుద్ధిలోపము.

సీ. సంసారమను మహా ◆ సాగరంబును దాటు
తరణియే తగినట్టి ◆ తరుణిగాదె
సంతోషమను మహా ◆ సాగరంబున దేల్చు
సాధనంబే నిజ ◆ సతియెగాదె
దుఃఖసంతతుల పో ◆ ద్రోలంగజాలిన
తరుణియే వనితా ర ◆ త్నంబుగాదె
తనకష్టములను ల ◆ తాబంధములు ద్రెంపు
మత్తేభ మేతగు ◆ మగువకాదె
భార్య యనినంత సామాన్య ◆ పడతియగునె
భర్తదేహమునం దర్ధ ◆ భాగమగును
కాని కన్యాధారలపోయు ◆ గడగువారు
నీతి బాహ్యుండగునను ట ◆ నిక్కువంబు.

ప్రియా ! నీవట్లు దలంచుట దగదు...ఆవిషయమటుంచుము. అర్ధరాత్రము మీరియుండవచ్చును. నిద్రాదేవత నన్నావహించుచున్నది.

చారు—తమరు పరుండుడు. నేనీ పల్లకపై హాయిగ బాడుచుండెదను.

జయ—నీవుకూడ పరుండరాదా ! పోనిమ్ము. నియానందమున కేనేల యాటంకము జెప్పవలయు. నీగానమాధుర్యమును గూడ చవిజూపుము. ఇట్టిలో నిద్దురబట్టిన నన్ను మేల్కొలపకుము. (పరుండును మరలలేచి) ప్రియా ! నీతో జెప్పమరచితిని. ఆమూల

నున్న నామాటను జాగ్రత్తపరచుము. అందొక యమూల్య
పదార్థమున్నది. కాని యందేమిగలదోయని పరిశీలింపదలంప
కుము. రేపటి యుదయమునసే నీకద్దానిని జూపగలను.

చారు—మహాప్రసాదము

(జయపాలుఁడు పరుండును. చారుమతి పాడుచుండును.)

చారు—(పాటనిలిపి) నాథుడు గాఢమైన నిద్దురలో నున్నాఁడు... జగన్మాతా! నాయభీష్టమీడేరినది. నా మ్రొక్కు చెల్లించుకొనుటకిదే వచ్చుచుంటిని. (జయపాలుఁడు శయనించిన శయ్యాతలము సమీపించిచూచి) బాగుగా నిద్దురబట్టినది. (విచారమున మెల్లన) నాథా సెలవు. (పాదములు కండ్లనద్దుకొనును.) బల్లపై నున్న పూవులపళ్లెరమును చేతబట్టుకొని,

(నిష్క్రమించును.)

జయ—(లేచి శయ్యపై కూర్చుండి.) వెడలినది. ఎక్కడికో యూహింపరాకున్నది. ఆమె తుదిపల్కుల యర్థము స్ఫురించుటలేదు. వెడలునపుడు పాదములంటినట్లయ్యెను. గతమేమిగానుండనోపునో. ఎందులకైనను యీమెను వెంబడించుటయే శ్రేయస్కరమని తోచుచున్నది. (నిష్క్రమించును.)

---

తెరయెత్తబడును.

కాళికాలయము.

[ప్రవేశము—చారుమతి.]

చారు—(పూజాదికముల గావించుచుండును.)

[ప్రవేశము జయపాలుఁడు.]

జయ—(స్వగ చారుమతిని పరికింపక) ఈ ఆలయములో ప్రవేశించినది. ఇచటికెట్టి యభిప్రాయముతో నరుదెంచి యుండెనో...

అదే! ఆమె కాళికను పూజించుచున్నది. ఇంక సురభి ప్రాణ
పడితిని. అయినను పరికించెదగాక.

చారు—(పూజచాలించి ధ్యానముచేసి.)

గీ. అంబ శాంభవి నీకటా • క్షంబు వలన
జీవితేశ్వరుపాద రా • జీవసేవ
నాకు ప్రాప్తించె; దక్షుశో • దర యొసంగు
మర్పణముగాని సంతోష • మందుమమ్మ!

(మెడలో గుప్తపరచిన కైజారునుదీసి) జైజగన్మాతా! (కుత్తుకకో సెడచుకొనును. కొలందిరక్తము శక్తిపాదములపై పడును. పరమేశ్వరి ప్రత్యక్షమై కత్తిని లాగివైచి.)

కాళి—చారుమతీ! సాహసింపకుము. నీభక్తికే నెంతయు సంతసించితిని. నీనాధునిగూడి చిరసౌఖ్యంబు లనుభవింపుము. నీపతిభక్తికి నేనెంతయు సంతసించుచున్నాను. కావున నీకొక్కవర మొసంగుచుంటిని. నీచేయి సోకిన మృతిజెందినవారు క్రమ్మరజీవింతురు. పోయిరమ్మ. నీనాధుడు నీకై నిరీక్షించుచుండును.

(అంతర్ధానమగును.)

చారు—(కాళికకు మరల నమస్కరించి.)

(నిష్క్రమించును.)

జయ—ఏమినాభాగ్యము. ఇట్టి సతీమణిని భార్యగా నొసంగినందులకు నిక్కముగా నేను పరమేశ్వరుని యధికముగ కొనియాడవలెను. ఇపుడామెకంటె ముందుగనేగి యెప్పటియట్లు శయనింతును.

(నిష్క్రమించును.)

తెరయెత్తగ—చారుమతి శయనాగారము

[ప్రవేశము—జయపాలుఁడు.]

జయ—ఆమెకంటెఁ ముందుగనే జనుదెంచితిని. ఇంతలో నామెయు రాగలదు. (పరుండును.)

[ప్రవేశము—చారుమతి.]

చారు—నాధుఁడింకను శయ్యపైనుండి లేచియుండలేదు. (పల్లెరమును బల్లపైనుంచి.) నిశ్చయముగా నాపరమేశ్వరి తనకునూన కటాక్షము నాపై నిల్పినది. ఆమె వాత్సల్యత వేనోళ్ల బొగడుటకేని తరంబగునా?......ఏమోగాని నేను నిద్దురయే రాకున్నది...అదే నా ప్రభువు దెచ్చిన ముల్లె. దానిని జాగ్రతపరుప వలసినదని చెప్పెను. ఎందులకైన నుంచిది. ఈబల్లపై నుంచెద గాక. (అట్లుచేసి) భాగముగ నుండునని తలంచితిని ..కాని యందేమున్నదోగాని మిక్కిలి తేలికగానున్నది. ఒకపరి విప్పి పరికింతునా? వలదు. పట్టిచూచిననో దెలియకుండునా! నాధుఁడు విప్పవలదని జెప్పెను. గాని యందేమున్నదో యూహింప ప్రయత్నింప వలదనలేదుగదా (పట్టిచూచి) అగమ్యము. ఏమియు దెలియుటలేదు. రేపటిదినమున వారే యందేమిగలదో జెప్పెదరుగదా! పోయి వారిపదములచెంతనే పరుండును. ఇంతరాత్రియైనను నిద్దుర రాదయ్యెను. అభ్యాసము లేకుండుటవలనగదా! నేఁడుగూడ నిదుర కఱవయ్యెను. (కండ్లు మూసికొని నిద్రించును.)

జయం—(బల్లపై నిదురనుండి మేల్కొనినట్లు లేచి.) ఎంతగాఢముగు నిద్దురబట్టినది. ఏలకో నాబహిఃప్రాణముగు భువనమోహినియు నను మేల్కొలుపదయ్యెను. అదేభువనమోహిని. ఆమెయు నిదురనుండి మేల్కొనలేదు. పోయి మేల్కొన జేసెదను.

(సమీపించి) ఇదేమి శయనతలమున నెవ్వడో పరుండియుండెను. వీడెవ్వడు? నా శయనాగార మెట్లు ప్రవేశింపగలిగెను. భువనమోహిని వీని పాదముల చెంగట పరుండియున్నదే? అంతఃపుర ద్రోహియగు నీతని ఖండించెదగాక. ముందుగ వీడెవ్వరో పరికించెదను. (ఇంచుక సమీపించి) జయపాలుండా! ఓరీ! ద్రోహీ! ఛండాలా! పయోముఖవిషకుంభమా! నాడావారకాంతతో నేనుగూడదలంచిన వారకాంతతో గుసగుసలాడి పంపివైచి నాతో నెన్నియో శ్రీరంగనీతు లాడితివే ఇప్పుడానీతు లెందేగినవి? స్నేహితుని భార్యయే నీకు గావలసివచ్చెనా! దుర్మతీ! శనిగ్రహమువలె విడువక వెంటాడించితివా? తగినఫల మనుభవింపుము. (కత్తితో శిరమును ఖండించును.) ఈదుర్మార్గునకు దగినశిక్షయైనది. ఈ భువనమోహినిని మేల్కొలిపి యీతండెట్లరుదెంచెనో యెరసెదగాక. (పరికించి చూచి) ఇదేమి మాయగానున్నది. ఈమె నా ప్రియురాలు కాదు... ఈ శయనాగారమో! ఇదియు క్రొత్తగనే గాన్పించుచున్నది. ఇదేమో! విభ్రాంతి గలుగుచున్నది.

చారు—(మేల్కొనును) ఇదేమి యేనో యలుకుడగుచున్నది. ఏమైయుండును. ఎదుటనున్న జయంతుని జూచి (స్వగ) ఈతండెవ్వరు. నా యంతఃపురములోని కెట్లు రాగలిగెను!

జయం—(స్వగ) ఈమె మేల్కాంచినది. ఈమె కెట్లు సమాధాన మొసంగవలయునో?

చారు—(స్వగ) ఈసమయమున నా నాథుని మేల్కొలిపెదగాక. (శయ్యపై నరుకబడిన జయపాలుని గాంచి) నాథా! నాథా! ఇగమి యిట్లుంటిరి. ఈదుర్మార్గుడు మీకెగ్గొనరించి యుండె

నా ? ఇంకనాకెయ్యది వెరవు ? (అని యాతనిపై బడి రోదన మొనరించును)

జయపాలుఁడు పునర్జీవితుఁడగును.

జయ___(జయంతునిజూచి) ప్రేతరూపమున నన్నింక యలయింప వచ్చితివా ! ప్రియా ! ఈతఁడు లోనికెట్లురాఁగలిగెను ? నీవు విచారించుచుంటివేమి ?

జయం___(స్వగ) మహాశ్చర్యముగానున్నది. నాచేఖండింపబడిన యీతఁడెట్లుజీవించెను ? నన్నుజూచి ప్రేతరూపమున జనుదెంచితివా ? యనుచుండెను. ఈతనికెట్లు ప్రత్యుత్తర మొసంగుదును. (ప్రకాశముగ) నాచే నిపుడు వధింపబడిన నీవుకూడ నట్లే ప్రేతవైతివనియే దోఁచుచున్నది.

జయ___నేను వధింపబడియుండలేదు. కాని నాకండ్లయెదుట నీవు నీ భార్య కత్తికెరయైతివి. మరల నెట్లుజీవింపబడితివి ?

జయం___ఏమో నేను వధింపబడినాడనో లేదో కాని నీవుమాత్రము నాకత్తికిపుడే గుఱియైతివి.

జయ___ప్రియా ! ఇదేమి. ఈతఁడు నన్నువధించియుండెనా ?

చారు___నాథా ! అతఁడు తమ్మువధించినసంగతి నిక్కువమే. కాని యీతఁడెట్లీసౌధమున కరుదెంచెనో దెలియదు. తమ్ముఁగాంచి దుఃఖితనై తమపైబడి రోదనమొనరించితిని. అంత తమరు మేల్కాంచిరి.

జయపా___(స్వగ) ఈమె నాగొనివచ్చిన యస్థికల నంటియుండెను గాఁబోలును. పరమేశ్వరియొసఁగిన వరప్రభావంబున నీతఁడా యస్థికలనుండి పునరుద్భవించెనని దోఁచుచున్నది. (చారుమతి నే ప్రశ్నించిచూచెదగాక) తరుణీమణీ ! ఏదీ నేనుగొనివచ్చిన మూట నిటుతెమ్ము ?

శార—(బల్లచెంతకరిగి జూచి మాటలేకుండుటచే) నాథా! అట నున్నచుల్లెను గొనివచ్చి యీబల్లపైనుంచితిని గాని యిపు డది గాన్పింపదు.

జయ—మిత్రమా! జయంతా! ఇన్నిదినములకుగదా! నినుజూడ గల్గితిని... నేడెంత సుదినము. ప్రియా! నేటికి నీమాంగల్యమున నాయనుంగుమిత్రుని క్రమ్మరగాంచు భాగ్యమలవడినది.

జయం—జయపాలా! ఇదేమి యిట్లనుచుంటివి? నేను నాభార్యచే నెట్లు నరుకబడితిని? క్రమ్మర యిచటికెట్లు రాగలిగితిని?

జయపా—ఆసంగతులన్నియు మనము సావకాశముగా జెప్పుకొందము. ప్రస్తుతము మనకు మహోపకార మాచరించిన యీమెకు ధన్యవాదము లర్పింపవలయును.

శార—నాథా! తమరు నన్నగ్గించుట లగ్గుగాదు.

జయ—ప్రియా! ఈ యానందమున కంతటికిని నీపతిభక్తియేగదా మూలకారణము. మిత్రమా! జయంతా?

గీ. వేశ్యనాటిన కలహంపు • బీజమిట్టి
దినదినాభివృద్ధిఁ జెందుచు • దిన్ ఫలించి
అఖిలలోకైకమాతయౌ • యంబవలన
పూర్ణముగ నశించె సుఖమిం • పొందుమింక.

జయంతా! మనచరిత్రాప్రబంధము ముగియవచ్చెను.

గీ. గణికతలపులతో నుప • క్రమణమొంది
నేడు పరమేశ్వరీకృపా • నీతవరము
చేత మనచరిత్రంబిట్లు • చెప్పరాని
ముదము చేకూర్చి పూర్ణత • బొందెగాదె.

జయం—సర్వసౌఖ్యము లొనగూడినవిగదా! ఇంక మనకేమి గావల యును.

జయ.—పరమేశ్వరివలన మనకు సర్వసౌఖ్యములును లభించిన నీ కేమి గావలయును. అయినను,

గీ. పతియెదైవంబుగాదమ ♦ భావమందు
నెంచి పూజించుసతులెల్ల ♦ నెన్నగాని
సౌఖ్యములబొందుదురుగాక ♦ జగతియందు
యీరీతిబాధలు కలుగక ♦ నెగడుగాక.

జయ.—తథాస్తు.

(తెరవ్రాలును.)

మంగళము.

ఇది శ్రీరమారమణ చరణసేవాతత్పర హారితసగోత్ర పవిత్ర
మద్దూరివంశలతాంకూర నరసమాంబా సోమనార్యపుత్ర
శ్రీరామమూర్తి నామధేయ ప్రణీతంబైన సంగీత
జయంత జయపాలము సర్వంబును సంపూర్ణము.

కృష్ణార్పణమస్తు.



# అనుబంధములు.

7వ పేజీ 24 పంక్తి తరువాత జయపాలుఁడు.

వలదు వలదు హితము గనుమమిత్రమా !
జననిందకు లోనగుదుము మనమున నూహింపుమా ॥వ॥

చ॥ గణికను పిలిపింపగ । నిందకుదలవంపగ
వలయు గాన । హితముబూని
మేలుకొనుము । మేలుగనుము ॥వ॥

---

16వ పేజీ 14 పంక్తి తరువాత జయపాలుఁడు.

ప॥ కనికరింపవలయునో । యువరాజచంద్ర
యెడబాసిన యెడ । నిలువజాలనిక ॥

చ॥ 1. చిరమైత్రి నిటుల । జెఁడనాడదగదు
మనవిని గొనుమా । కోపముపీడినన్ ॥కని॥

---

(జయంతుని వచనమైన తరువాత.)

2. నీపాదములాన । నిక్కమాడుచుంటి
కరుణజూడకున్న । గతియెలేదునాకు ॥క॥

---

16వ పేజీ 23 పంక్తి తరువాత జయపాలుఁడు.

హాతవిధీ ! హాతవిధీ !! హాతవిధీ !!!
కారణంబులేక మాకు । వైరముగల్గించితే ॥హాత॥

చ॥ ఏపాపంబెరుగనట్టి హితుల నిటులగాసివెట్ట
పాడియౌనటంచు । భావమునఁ దలచితే ॥హాత॥

---

20వ పేజీ 18 పంక్తి జయంతుఁడు.

ప॥ చెలియేలా । యీలీలా । జాలముసేయఁగ మేలా
మారునియానన్ । బాయనునిన్నిక

కోపముమానుము । కూరిమిజూడుము
అధరమొసఁగి న । న్నాదరింపుమిఁక
అంచయానవే । పెరవాడనటే॥

---

26వ పేజీ 14 పంక్తి తరువాత జయపాలుఁడు.

హాతవిధీ నామదినేడదియేమో కలతజెందెను ।
కారణమింతైనలేక కనులకేలా నిదురరాదు
యేమికీడుగలుగునో । యెఱుఁగరాదు సుంతైన ॥హాత॥

---

29వ పేజీ 20 పంక్తి తరువాత వెంకడు.

ఎందుకీయెవ్వారం । యెల్లిపోయె శేగిపిల్లా
కూంతైనచుకంనేక । కూకుండలేనింక ॥ఎం॥
1. చుక్కొడిచివదాకాను । సూపిసూసియినుగత్తి
కన్నొదునుకుకూకున । కాపడవు కాపడవు ॥ఎం॥
2. శేగిశేగొత్తానని । పెద్దపెద్దమాటలాడి
అద్దరేతిరైసకాని । అగుపించకపోతావు ॥ఎం॥

---

34వ పేజీ 23 పంక్తి తరువాత జయపాలుఁడు.

వ॥ ఎట్టిచెడుగు చేసినావె । కులటా॥
పూజసేయదగిన నాథు । పాలియింపగదగునా॥
పాలవంటి కులమునెల్ల । పాడుచేసి విటునిగూడ
నిటులనాథునిచేతేతుల । నిందగోర్చి జంపితివె॥

---

39వ పేజీ 28 పంక్తి తరువాత జయపాలుడు.

వ॥ ఓమహేశా! స్వప్రకాశా!

అ॥ సుజనపోషణా! భక్తపాలనా॥ ఓ॥

1. హితులనిటుల వేరుపరచి । నలయించుట భావ్యమా
ననుగూడను గానిషాన్మిక । నిలువజాల నీభూమిన్॥ ఓ॥

2. అఘరహితుని నాదుసఖుని । చెంతజేర్చి బ్రోవుమయ్య
శరణుగోరు వాడనై ననన్ । వరమకృపను గనుగొను॥ మో॥

---

42వ పేజీ 18 పంక్తి తరువాత జయపాలుడు.

॥ దేవాదిదేవా । దివ్యప్రభావా
సురాసురులక । గోచరుండవై
చరాచరంబుల । బరిపాలించెడి॥

(నాకి) సృష్టిస్థితిలయకారణ కారణా
నిర్వికారప్రభూ, నిత్యసంకల్పహృదయా॥

---

62వ పేజీ 12వ పంక్తి తరువాత చారుమతి.

ఈ......వియోగమోర్వజాలనే......నేసీ॥ వి॥

ఓర్వజాలనే.........ఈవియోగభరమిక॥
ప్రాణనాథా- దర్శనంబు
కూరిమితో- గాంచనైతి
యేమిసేతు- నెటులసైతు
మారుబారికోర్వజాల॥
సాటివారి- తోడసుఖము
గాంచనైతి- కుందుచుంటి

వ్యర్థమయ్యె- నాదుజన్మ
కటాభరించ- జాలనింక॥

79 వ పేజీ 16 వ పంక్తి తరువాత చారుమతి.

ప॥ చరితార్థత నొందితిగా॥ నే॥

1. మహాయోగి జనవాంఛితమైన । శర్వాణిని కనులారగ ।
గనుటవలన॥ చ॥

2. కనుగొని దయచే । వరములగైకొని । ఘనముదమందగ
గలుగుటవలనన్॥ చరి॥

---

81 వ పేజీ 6 వ పంక్తి తరువాత జయంతుఁడు.

హితుడంచును । మదినెంచని । తుంటవనొంచెదగా
పరసతులను గవయనెంచు । పాపాత్మునినొంచెదన్
పాపమనుచునెంచబోక । హితునిసతిని గూడినట్టి
పాపాత్ముని దుర్మదాంధు । ప్రాణంబుల దీసెదన్॥

---

మంగళం.

(సమాజికులందరు కలసి పాడఁదగిది.)

హారతిజయజయ । హారతిదయతోడ కాళీకైకొనుమా॥
ధరణిలోన నలరెడు జనముల జయమునకై ॥ హా॥
సంకల్పాభయ కల్పితభక్త కల్పవల్లీ
సత్కృపారసముచల్లీ । తల్లీ॥ హా॥

సంపూర్ణము.

---

శ్రీ సత్యానంద ప్రెస్, ఇన్నీసుపేట, రాజమహేంద్రవరము.

# నవలలు—పరిశోధకనవలలు.

| | | | |
|---|---|---|---|
| పంజాబుమెయిలు రు. | 0-12 | విషహృదయము | 1-0 |
| సీతేపా | 0-12 | టోపీదాసు కామిక్ | 0-8 |
| చదువుకొన్నభార్య (Educated wife) | 0-12 | వలపులరాణి | 0-12 |
| శక్తికుమారి | 0-12 | దొంగలనాయకుడు | 0-12 |
| అయిదులక్షలరూపాయిలు | 0-12 | అర్ధరాత్రపువింత 8 హత్యలు | 0-12 |
| అల్లూరి సీతారామరాజచరిత్ర | 0-6 | లోకాభిరామాయణంకామిక్ | 0-8 |
| రమాసుందరి | 1-0 | పరిశోధన | 0-12 |
| పోలింతాయి | 0-12 | మోహపిశాచము | 0-12 |
| | | డిటో రెండవభాగము | 0-12 |

# కథలు—చరిత్రలు.

| | | | |
|---|---|---|---|
| శ్రీనాథకవి చరిత్ర | 0-12 | మహాపతివ్రతల కథలు | 1-0 |
| భోజకాళిదాసు కథలు | 0-12 | పంద్రెండురాజుల కథలు అను | |
| భట్టివిక్రమార్కుల కథలు | 1-4 | శ్రీకృష్ణబోధామృతం | 0-12 |
| గులేబకావళి కథలు | 0-12 | శుకసప్తతికథలు | 0-12 |
| తెనాలిరామకృష్ణకవి చరిత్ర | 0-12 | మదనకామరాజు కథలు | 0-8 |

# శృంగారగ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| పడకటింటిముచ్చట్లు | 0-12 | మన్మథసామ్రాజ్య అను | |
| సతీపురుషరహస్యములు | 1-0 | కళాశాస్త్రరహస్యములు | 0-12 |
| శృంగారపద్యములు | | అంతఃపురరహస్యాలు | 0-12 |
| కాకెటర్సుకు ఉపయోగము | 0-4 | మోహశిఖలు అను కాకెటర్సు | 0-12 |

# టీకాశతకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| బాలరామాయణం | టీక. | 0-2 | సుమతీశతకం | టీక | 0-2 |
| భాస్కరశతకం | ,, | 0-4 | నరసింహశతకం | ,, | 0-4 |
| కుమారీశతకం | ,, | 0-2 | కృష్ణశతకం | ,, | 0-2 |
| వేమనశతకం | ,, | 0-3 | దాశరథీశతకం | ,, | 0-4 |
| గజేంద్రమోక్షం | ,, | 0-6 | రుక్మిణీకల్యాణం | ,, | 0-6 |
| కాళహస్తీశ్వరశతకం | ,, | 0-6 | శివానందలహరి | ,, | 0-6 |

కొండపల్లి వీరవెంకయ్య, శ్రీసత్యనారాయణ బుక్కుడిపో, రాజమండ్రి.